# ముందు మాట

మన భారతభూమి శాంతికి, సంతోషానికీ, సుఖానికీ ఆలవాలంగా ఉండి ఆనందాలతో ఓలలాడుతుండేది. కానీ ఆంగ్లేయులు మన దేశానికి వ్యాపారార్థులై వచ్చి తీరా మన సిరి సంపదలను చూచి మన దేశాన్నే పాలించాలనే అత్యాశకు లోనయ్యారు. దీంతో మన ఆంతరంగిక శాంతికి భంగం వాటిల్లింది. దేశ భద్రతకు ముప్పు కల్గింది. రాజులు రాజ్యాలు సంస్థానాలు రూపుమాసిపోయాయి. ఈ జరుగుతున్న విషయాలన్నీ సాక్షులుగా చూస్తూ కూర్చోడమంటే ఎంతటి నగుబాటైన విషయమో! కానీ ఎవరూ అలా స్పందన లేకుండా లేరు. భారతీయులలో అలజడి ప్రారంభమైంది. ఇందుకు తాము ఏమి చేయాలి? ఏమి చేయగలం అని దేశభక్తి గల్గిన ప్రతి పౌరుడూ యోచించాడు. సిపాయిలందరూ ఒక్కటైతే ఆంగ్లబలం వీరి కాలిగోటికి పోలదు అని నిర్ణయించారు. అందరూ ఒక్కటైనారు. తుపాకులకెదురుగా తమ ఐకమత్యాన్ని, గుండెదిటవునూ ప్రదర్శించారు. 1857లో జరిగిన ఈ ప్రయత్నమే స్వాతంత్ర్య సంగ్రామానికి ప్రథమ శంఖారావం. అప్పుడు విజయం ఆంగ్లేయులకే లభించినా భారతీయ శౌర్యదీధితులను, క్రాంతిని చూసి వారు లోలోపలే బెదిరిపోయారు. భారతీయులకు కూడా తమ శక్తి ఏమిటో తమకు తెలిసింది. అణువణువునా, కణకణాన దేశభక్తి ఉరకలెత్తింది.

ఇంతకు ముందు కొందరు అరణ్యాలలో ముక్కుమూసుకొని తపస్సు చేసుకొనే శాంతి కాముకులైన, మహాత్ములైన ఋషులు మాత్ర దాస్య విమోచనం కొరకు కాషాయ జండాలను పట్టుకొని గుఱ్ఱాలపైన అతి ధైర్యంగా స్వారీ చేస్తూ 'హరే మురారే మధుకైటభరే' అనే నినాదాలు చేస్తూ తమ దేశభక్తిని, పరపాలనకు నిరసనమూ తెలియజేశారు. 1774 వరకు పన్నెండేళ్ళు సాగిన ఈ మహాత్ముల నిరసనమూ, 1857లో

జరిగిన సిపాయిల స్వాతంత్ర్య సంగ్రామాన్ని గురించి తెలుసుకున్న బంకించంద్ర ఛటర్జీ హృదయంలో మాతృదేశం పట్ల పట్టరాని ప్రేమ పెల్లుబికి వచ్చింది. ఈ ప్రభావంతో, ఈ స్ఫూర్తితో, ఈ ఆశయంతో 'ఆనంద మఠం' అనే నవలలో 'వందేమాతరం' అంటూ అమ్మకు ఎలుగెత్తి వందనాలు సమర్పించుకున్నాడు. ఈ వందేమాతరమే స్వాతంత్ర్యోద్యమ నాయకుల జిహ్వాగ్రాన మహామంత్రమై భాసించి చివరకు తన మహత్యాన్ని చాటుకుంటూ, భారతీయులకు స్వాతంత్ర్యాన్నందించింది.

ఎందరో దేశభక్తులు, మహానాయకులు 'వందేమాతరం' అంటూ ధనాన్ని, సర్వస్వాన్ని కడకు ప్రాణాలనే సమర్పించుకున్నారు. ఇంతటి ఔన్నత్యం కల ఈ గీతాన్ని గురించి నేడు వాగ్వివాదాలు రేకెత్తడం ఎంతో శోచనీయమైన విషయం.

ఈ దేశంలో పుట్టి మనుగడ సాగించే ప్రతివారూ మాతృభూమికి నమస్కరిస్తూ వందేమాతరం పాడాల్సిందే.

-వందనీయ తాయీజీ

# మనవి

స్త్రీయే రాష్ట్రానికి ఆధారశక్తి. అందుచేతనే స్త్రీలను చైతన్యవంతులుగా తీర్చిదిద్ది తమలో ఉన్న శక్తిని తాము తెలుసుకొనేలా చేస్తూ, వారిలో ఉన్న దేశభక్తిని, క్రియాశక్తిని దేశానికి ఉపయుక్తంగా మలుస్తూ రాష్ట్ర సేవికాసమితి అవిశ్రాంత కృషి చేస్తోంది. ఈనాడున్న పరిస్థితిని గ్రహించి 'వందేమాతరం' ఉద్యమమే ఔషధమని తలచి వందేమాతర గీతానికి పునఃప్రాచుర్యం తేవాలని నిర్ణయించుకుంది. 1894లో పరమపదించిన శ్రీ బంకించంద్ర ఛటర్జీ స్మృతి శతాబ్ధి సంవత్సరాన్ని పురస్కరించుకుని ఈ సంవంత్సరాన్ని 'వందేమాతర సంవత్సరం'గా ప్రకటించింది. ఈ సందర్భంగానే కొన్ని కార్యక్రమాలు చేపట్టటం జరిగింది.

1. యావత్ భారతదేశంలోనూ 'పూర్ణవందేమాతరం' పాటల పోటీలు నిర్వహించుట.

2. పూర్ణవందేమాతరంను చక్కని స్వదస్తూరితో వ్రాసే పోటీలు.

అలాగే మరికొన్ని ప్రోత్సాహకరమైన పోటీలను నిర్వహించదలచాము.

ఈ గ్రంథ ప్రచురణ కూడా ఈ ఉద్యమంలో ఒక భాగమని మనవి చేస్తున్నాం. సుశీలా అభ్యంకర్ గారు రచించిన - 'వందేమాతరం' పుస్తకం, చిత్రాజోషిగారు రచించిన 'వందేమాతరం' పుస్తకం, మణిగారు ఆంగ్లంలో రచించిన వ్యాసం, మరికొన్ని పుస్తకాల ఆధారంగా ఈ గ్రంథం రచింపబడింది.

**శ్రీ శింగారెడ్డి బ్రహ్మానందరెడ్డి, శ్రీమతి డా॥ దిట్టకవి శ్యామలా దేవి** గార్లు ఈపుస్తకం ఒక ఆకృతి పొందడానికి సహకరించారు. వారికి మా ధన్యవాదములు. విశేషమైన సహకారం అందించిన శ్రీ రామ్‌సాతే గారికి మా ప్రత్యేక ధన్యవాదములు.

—ప్రకాశిక

# విషయ ప్రవేశం

## స్వాతంత్ర్యం వచ్చి 46 సం.లు పూర్తయిన తర్వాత......

"వందేమాతరం'ను 1992 పార్లమెంట్ శీతాకాల సమావేశాల ప్రారంభంలో పాడాలని నిర్ణయిస్తే, ఆనిర్ణయాన్ని కొన్ని రాజకీయపక్షాలు వ్యతిరేకించాయి. ఆ వ్యతిరేకతకు కారణం ఆ గీతంలో విగ్రహారాధనకు ప్రోత్సాహం లభిస్తున్నదని ముస్లింలీగ్ సభ్యుల అభియోగం. సెక్యులరి జానికి వ్యతిరేకమని జనతాదళ్, సి.పి.ఐ. సి.పి.యం. సభ్యుల ఆక్రోశం. అంతేగాక రాష్ట్రీయ స్వయంసేవక సంఘ్, భారతీయజనతాపార్టీ లాంటి తాము వ్యతిరేకించే సంస్థలు ఆ గీతాన్ని పాడుతున్నారు కాబట్టి మేం వ్యతిరేకిస్తున్నామనే వితండవాదాన్ని కూడాలేవనెత్తారు.

- ఒకనాడు ఆంగ్లేయులకు వెన్నులో వణుకుపుట్టించి, కంటినిండా నిద్రకూడా పోనీయకుండా చేసిన వందేమాతరం...... .

- ఆ గీతాన్ని, నినాదాన్ని వినగానే ఒళ్ళు పులకించి, భారతీయులు ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ఉద్యమాలు నడపడానికి స్ఫూర్తినిచ్చిన వందేమాతరం........

- తమ జీవితాల్ని బలిదానం చేసైనాసరే జన్మనిచ్చిన దేశాన్ని బ్రిటిష్ సంకెళ్ళనుండి విముక్తి చేయడానికి ముందుకురికిన యువకులు విప్లవకారులుగా మారటానికి కర్తవ్యాన్ని బోధించిన వందేమాతరం......

- భారతజాతి ఒక మంత్రంగా, తంత్రంగా, ఆయుధంగా భావించిన వందేమాతరం........

- ఒక జాతికి తన కర్తవ్యమేమిటో బోధించిన మరో 'భగవద్గీత' వందేమాతరం.......

అలాంటి ఒక స్ఫూర్తి మంత్రాన్ని పాడితే ఎవరికో కోపమొస్తుం దేమో, ఓట్లు పోతాయేమోననే చింతతో రాజకీయనాయకులు దాని మహత్వం, నిడివి తగ్గించారు.

స్వాతంత్ర్య సముపార్జనలో ఒక విశిష్ట స్థానాన్ని పొందిన ఆ గీతం మహాత్మ్యాన్ని తగ్గించిన తర్వాత మనలోని దేశభక్తిని నిర్మించే సంస్కారం తగ్గిపోయింది. దేశభక్తిని కల్గించే ఒక ఆధారం వదిలేయుటంతో ఒక దిక్కుతోచని స్థితిలో కొట్టుకుపోతోందీ నాడు దేశం. ఒక పదంతో ఆనాడు ఆంగ్లేయులను పారద్రోలిన దేశం, ఈనాడు నాటి రాజకీయ బానిసత్వానికేమీ తీసిపోని ఆర్థిక బానిసత్వానికి బలవంతంగా వెళ్ళిపోయే స్థితికి చేరుకుంటున్నది. ఆ స్థితికి చేరుకోకముందే మన యువతీ యువకులను మేల్కొల్పడానికి, దేశభక్తి పూరితులను చేయవలసి ఉంది. వందేమాతర గీతంలో ఎన్ని చరణాలున్నాయో తెలీని యువతీ యువకులకు, మరోమారు వందేమాతరగీతాన్ని, బంకించంద్రుని వారికి పరిచయం చేయవలసిన అవసరం ఎంతో ఉంది.

ఆ దిశలో ప్రస్తుతం ఈ పుస్తకం సాగబోతోంది.......

# బంకించంద్ర ఛటర్జీ - ఒక ద్రష్ట

'వందేమాతరం' - ఈ జాతీయ గీతాన్ని గురించి తెలియనివారు ఈ భారతదేశంలో ఎవరుంటారు? శాలివాహన శకం 1797 సం॥ జగజ్జనని పూజాదినమైన కార్తీక శుద్ధనవమి(7-11-1875) రోజు ప్రసిద్ధ బెంగాలీ కవి బంకించంద్ర ఛటర్జీ మనస్సులో ఈ జాతీయగీతం స్ఫురించింది. భారతదేశంలో ఆనాడున్న పరిస్థితులకు స్పందించి వాటిని మార్చడంలో తనవంతు కర్తవ్యమేమిటి? వాటినే విధంగా మార్చాలనే గాక, మార్చి తీరగలననే ఆత్మవిశ్వాసం కల్గింది. ఆయన హృదయంలో మాతృదేశం పట్ల భక్తిభావం వెల్లువలా పొంగగా 'వందేమాతరం' అనే అక్షరాలు వాటంతటవే స్ఫురించాయి. 'వందేభారతం' అనే పదం కాకుండా 'వందేమాతరం' అని మనస్సులో మెదలటంలో ఆయన సంస్కారం బహిర్గతమవుతున్నది. ఎందుకంటే 'భారతం' అంటే కేవలం హిమాలయాల నుండి సముద్రం వరకు ఉండే భూభాగం అనే స్ఫురిస్తుంది. కానీ 'మాతరం' అన్నప్పుడు తనకు జన్మనిచ్చిన తల్లి అనే భావన కలుగుతుంది. తల్లి అనే భావనకు భారతీయ సంస్కృతిలో ప్రత్యేకించి మహత్వమున్నది. ఈ ఆలోచన చాలా పురాతనమైనది. "మాతా భూమి పుత్రో హం పృథివ్యాః". జనని, జగన్మాత అనే పదాలకు భారతీయ సంస్కృతిలో వేదకాలం నుండి ఎంతటి మహత్వమున్నదో మనందరికీ తెలుసు. కవికి ఆ సంస్కారం ఉన్నందువలననే ఆయన ఈ 'వందేమాతరం' అనే గేయాన్ని వ్రాయగలిగాడు. అలాంటి భావాలే ఈ దేశవాసులందరి మనస్సుల్లో ఉన్న కారణంగా కోట్లాది మంది హృదయాలు ఆమంత్రంతో ప్రతిధ్వనించాయి. ఆ పదాలు భారతావనికి పూజా పుష్పాలు అయ్యాయి. విదేశీయులను పారద్రోలడానికి అవి ఆయుధాలుగా మారాయి. ఇటువంటి గీతం యొక్క నిర్మాతను గురించి తెలుసుకోవటం అవసరం.

బంకిం చంద్రుదు బెంగాల్ లో గంగానదికి పశ్చిమతీరాన గల కంథల్

పారా అనే గ్రామంలో గౌరవనీయులుగా పేరుగాంచిన కుటుంబంలో 1838 జూన్ 26న జన్మించారు. కంథల్‌పారా గ్రామం తూర్పురైల్వేలోని నైహతి రైల్వేస్టేషన్‌కు దగ్గరలో అచ్ఛమైన గ్రామీణ వాతావరణంతో అలరారుతుండేది. కలకత్తా నుండి రైల్లో ఒక గంటసేపు ప్రయాణిస్తే కంథల్‌పారాగ్రామం వస్తుంది. ఆయన తండ్రి ఒరిస్సాలో డిప్యుటి కలెక్టర్‌గా పనిచేసేవారు.

గ్రామంలోని ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయుడి వద్ద బంకించంద్రుడు చదువునేర్చుకున్నాడు. 1844లోతన తండ్రి మిడ్నాపూర్‌లో ఉద్యోగం చేస్తున్న సమయంలో అతని ప్రాథమిక విద్య ప్రారంభమైంది. ఆ పాఠశాలలో ఆంగ్లంలో విద్యాబోధన జరిగేది. ఆ పాఠశాల ప్రధానోపాధ్యాయుడు ఆంగ్లే యుడు. ఆ సమయంలోనే అతనిలో దాగి ఉన్న అంతర్గత గుణాలు వెలికి వచ్చాయి. తన పాఠాలను నేర్చుకోవడంలో అసాధారణ ప్రజ్ఞను, వేగాన్ని ప్రదర్శించేవాడు బంకించంద్రుడు. ఇది గమనించిన అతని తండ్రి కుమారుని చదువుపట్ల మరింత శ్రద్ధ వహించాల్సివచ్చింది. ఆంగ్లభాషలో ప్రావీణ్యం పొందడానికి మిడ్నాపూర్‌లో చదువు పునాది అయింది. మిడ్నాపూర్‌లో 4.సంవత్సరాలపాటు చదివిన తర్వాత బంకించంద్ర కంథల్‌పారాకు తిరిగి వచ్చాడు. 1849లో ఆరోజుల్లో ఉన్న సంప్రదాయం ప్రకారం 5సంవత్సరాల వయస్సున్న బాలికతో బాల్యవివాహం అయింది.

పై చదువులు చదివే నిమిత్తం ఆ రోజుల్లో పేరు ప్రఖ్యాతులున్న హుగ్లీ కళాశాలలో చేరాడు. కంథల్‌పారా నుండి హుగ్లీ కళాశాలకు వెళ్ళాలంటే ప్రతిరోజూ గంగానది దాటివెళ్ళాలి. అయితే అలాంటి సమస్యలు అతని విద్యా భివృద్ధికి ఎలాంటి భంగకరంగా పరిణమించలేదు. 1853 వ సం॥లో ప్రాథమిక విద్యార్థి వేతనం కొరకు జరిగిన పరీక్షలో ప్రథముడిగా ఉత్తీర్ణుడయ్యాడు. దాంతో అతనికి విద్యార్థి వేతనంగా 8రు॥లు లభించేవి. 1856వ సం॥లో ఉన్నత విద్యార్థివేతనం కొరకు జరిగే పరీక్షలో నెగ్గి 20రు॥లు విద్యార్థివేతనం పొందాడు. అన్ని విషయాల్లోను అత్యధిక ప్రతిభ కనబరచినందుకు ఆ వేతనం లభించింది. కళాశాలలో చదువుతున్నప్పుడే ఆంగ్లభాషలో ప్రావీణ్యత సంపాదించాడు. తర్వాత కొద్దికాలంలో 'రాజ్ మోహన్స్ వైఫ్' (రాజమోహన్

భార్య) అనే నవలను ఆంగ్లభాషలో వ్రాశాడు. భారతీయులు తమకంటే ఆంగ్లేయులు గొప్పవారనుకునే సమయంలో ఆంగ్లంలో అంతటి ప్రావీణ్యత సంపాదించినప్పటికీ, అతనికి ప్రాచీన, ఆధునిక భారతీయభాషలపై మమకారం, ప్రేమ, గౌరవం తగ్గలేదు. కళాశాలలో చదువు కొనసాగుతున్నప్పుడే అనేకమంది పండితుల వద్ద సంస్కృతభాష నేర్చుకున్నాడు. ఆధునిక పాశ్చాత్య విజ్ఞానంపై అతనికి ఎంత అభిలాష, నమ్మకం ఉండేదో అంతే నమ్మకం, గౌరవం ప్రాచీన విజ్ఞానంపై కూడా ఉండేది. ఆ విధంగా తన జీవితంలో స్వయంగా సాధించదలచుకున్న ఘనకార్యంకోసం తనను తాను పరికరంగా మలచుకొన్నాడు.

జన్మతః పొందిన మరొక గుణం ఇంకోవిధంగా బయటకొచ్చింది. హుగ్లీ కళాశాలలో ఉండటంవల్ల అతడిలో ఉన్న సాహిత్యాభిలాష మొగ్గతొడగడం ప్రారంభించింది. ఈశ్వరచంద్ర గుప్త అనే కవి రెండు అతి ముఖ్యమైన పత్రికలను, నడిపేవారు. అవి 'సంబాబ్ ప్రభాకర్'(1831)'సంబాబ్ సాధురంజన్'(1847) బంకించంద్ర 1852 నుండి అంటే తన 14 సం॥ల వయస్సులో ఆ పత్రికలకు కవిత్వం వ్రాసేవాడు. 1853లో సంబాబ్ ప్రభాకర్ పత్రిక నిర్వహించిన కవిత్వపోటీలో పాల్గొని నగదుబహుమతి కూడా పొందాడు. పత్రిక నిర్వహించే పాటలరచన పోటీలలో తన ప్రతిభను బంకించంద్ర నిరూపించుకున్నాడు. స్వతహాగా కవి అయిన ఈశ్వరచంద్ర గుప్త బంకించంద్రుడికి స్ఫూర్తిదాత అయ్యాడు. బంకించంద్రుడు ప్రారంభంలో వ్రాసిన కవితలను గనుక పరిశీలిస్తే, అతనిపై ఈశ్వరచంద్ర గుప్త ప్రభావం ఎంతగా ఉందో అర్థమవుతుంది.

1856వ సం॥లో హుగ్లీకళాశాలలో విద్యాభ్యాసం పూర్తయింది. తర్వాత జులై 1856లో కలకత్తాలోని ప్రెసిడెన్సీ కళాశాలలో న్యాయవిద్య నభ్యసించడానికి చేరాడు. ఆ సమయంలో అతని మొదటి కవితల పుస్తకం 'లలిత్‌పురాకాలిక్ గల్పతథా మానస్' వెలుగు చూసింది. అప్పటి నుంచి బంకించంద్ర కవిత్వం కాక వచనంలో వ్రాయటం ప్రారంభించాడు.

1857లో ప్రారంభమైన కలకత్తా విశ్వవిద్యాలయం ఆ సం॥ ఏప్రిల్

నెలలో ప్రవేశపరీక్ష నిర్వహించింది. ఆ పరీక్షకు న్యాయ విషయంలో హాజరై ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడయ్యాడు. ఆ పరీక్ష పదమూడు. మంది వ్రాయగా ఇద్దరు ఉత్తీర్ణులయ్యారు. ఆ ఇద్దరిలో ఒకరు బంకించంద్ర. కొత్తగా ప్రారంభమైన విశ్వవిద్యాలయం నిర్వహించిన మొదటి పరీక్షలో అతడు సాధించిన విజయం మేధావి వర్గానికి చాలా ఆనందదాయకమైంది. ప్రభుత్వ అధికారులను ఆకర్షించటానికి ఆ విజయం ఒక్కటి చాలు. బెంగాల్ లెఫ్టినెంట్ గవర్నర్ ద్వారా డిప్యూటి మేజిస్ట్రేట్‌గా, డిప్యూటి కలెక్టర్‌గా జెస్సోర్‌లో నియమింపబడ్డాడు బంకించంద్ర. అతడి తండ్రిలాగే బంకించం ద్రుడు కూడా డిప్యూటి మేజిస్ట్రేట్ అయ్యాడు. డిప్యూటిమేజిస్ట్రేట్ కన్నా మరింత పెద్ద పదవి సామ్రాజ్యవాద ఆంగ్లేయ పాలనలో భారతీయులకు లభించేదికాదు.

బెంగాల్‌లో నీలిమందును తయారు చేసేందుకుపయోగపడే ఇండిగో మొక్కల తోటల్లో గ్రామస్థులపై, ఆంగ్లేయులు అనేక అత్యాచారాలు చేసేవారు. ఒక ఆంగ్లేయుడి వద్దనైతే పిస్టల్ ఉందనే భయంతో ప్రభుత్వ అధికారులతోసహా ఎవరూ ఆయన దగ్గరకి వెళ్ళేవారుకాదు. బంకించంద్ర అక్కడికి మేజిస్ట్రేట్‌గా వచ్చిన తర్వాత ఆ సంగతి తెలిసింది. స్వయంగా తానేవెళ్ళి ఆ ఆంగ్లేయుడిని అరెస్ట్ చేశారు. ఈ విధంగా క్రమశిక్షణతో, ప్రామాణికంగా పనిచేయటం మూలంగా అందరూ ఆయనంటే ఇష్టపడేవారు. తప్పుచేసిన వారు ఆయనంటే భయపడేవారు. పై అధికారులకు ఆయనపట్ల ఎంతో ఆదరణ ఉండేది.

19వ శతాబ్దం ఉత్తరార్ధంలో మేధావంతులైన అనేకమంది భారతీయ యువకులు అతిగౌరవనీయ కుటుంబాలకు చెందినవారైనా సరే, ఆంగ్లేయ ప్రభుత్వంలో ఉద్యోగులుగా మారి వారికి సేవలు చేసే వారు. తద్వారా తమ భారతీయసోదరులు విదేశీపాలకుల పాలనలో బానిసలుగా ఉండేందుకు తోడ్పడేవారు. పరిస్థితుల ప్రభావంతో ఆంగ్ల పాలకులకు సేవచేస్తున్నప్పటికీ వారిలో దేశభక్తి అనే అగ్ని రగులుతూనే ఉంది. అలాంటి వారిలో వాసుదేవ బలవంత ఫాడ్కే ఒకరు. ఇతడు తన ఉద్యోగాన్ని కూడా వదిలివేసి 1879లో

విప్లవోద్యమంలో పాల్గొన్నాడు. అయితే ప్రభుత్వోద్యోగాల్లోనే కొనసాగుతూ ఆంగ్లేయులకు సేవచేస్తున్నా, కొందరు తమ ఇళ్ళలో విదేశీ వస్తువులనుగాక, నాణ్యత తక్కువగా ఉన్నవైనా సరే స్వదేశీ వస్తువులనే వాడేవారు. ఇలాంటి పరిస్థితిలో బంకించంద్రుడిలోని దేశభక్తి మరో పద్ధతిలో వికసితమైంది.

ఒక రచయితగా, తనకున్న సాహిత్య జ్ఞానంతో, రచనా నేర్పుతో తన మాతృభాష బెంగాలీని మరింత సుసంపన్నం చేశాడు బంకించంద్ర. ప్రారంభంలో కేవలం తన పాఠకులను ఆనందడోలికల్లో ముంచెత్తడమే పరమావధిగా అందమైన కథలను వ్రాసేవారు. ఇలాంటి రచయిత అరవిందుడిమాటల్లో చెప్పాలంటే 'ఒక ఋషిగా, దేశ నిర్మాత'గా మారిపోయారు. బంకించంద్రుడు వ్రాసిన 'ఆనందమఠం' నవలలో 'వందేమాతరం' గీతం దేశాన్ని ఒక అలౌకిక స్థితికి తీసుకెళ్ళింది. పశ్చిమదేశాల సంస్కృతిని మిన్నగా భావించిన, ఆంగ్లవిద్య నభ్యసించిన భారతీయులు తమదేశ వారసత్వాన్ని, సంస్కృతిని కించపరిచే స్థితికి చేరుకున్నారు. జాతీయతను, దేశం యొక్క గతాన్ని గుర్తించి గర్వపడటానికి అవసరమైన భావనలను బంకించంద్రుడు అందించాడు. ఆనందమఠంతో సహా మిగిలిన అతని అన్ని రచనలూ, విదేశీ పాలనలో సజీవత్వాన్ని కోల్పోతున్న సమాజానికి దేశభక్తి అనే ఔషధాన్ని నూరిపోశాయి.

బంకించంద్రుడి ఆలోచనలు భారతదేశమంతటా విస్తరించాయి. అందుకు ఒక్క ఆంగ్లభాష మాత్రమే సహకరించిందనడం తప్పు. సాహిత్యం ప్రచారం కావటమనేది ఆనాడున్న పరిస్థితుల దృష్ట్యా అంత సులభమేమీకాదు. అయినా అతని ఆనందమఠం నవల అన్ని భారతీయ భాషల్లోకీ అనువదింపబడింది. అన్ని భారతీయభాషల్లోకి అనువాదం చేయబడిన రచనలు చేసిన బెంగాలీ రచయితల్లో బంకించంద్ర ఒకరు. దీన్ని బట్టే అతనిలో దాగి ఉన్న దేశభక్తి ఎంత తీవ్రమైందో, ఎంత శక్తి వంతమైందో, తన అభిప్రాయాలను ఎంత ఉపయోగకరంగా సాహిత్యం ద్వారా ఎలా తెలియజేసేవాడో అర్థమవుతుంది. దీంతో ఆయన దేశమంతటా ప్రసిద్ధిపొందారు. తన రచనల ద్వారా ప్రజలను కదిలించేవారు. ఆ భావాలను వారిలో నింపేవారు. ఆయన

సాహిత్య జీవనం ఒక సంక్లిష్ట భూమిక ఆధారంగా ఆకృతిని దాల్చింది.

1838 సం॥లో బంకించంద్రుడు పుట్టిన సమయానికి భారతరాజకీయ శక్తి కేంద్రాలను ఆంగ్లేయులు అణిచివేశారు. తమ ఆధీనంలోకి తెచ్చుకు న్నారు. అనేకమంది భారతీయ చక్రవర్తులు తమ రాజ్యాలను కోల్పోయారు. మిగిలినవారు 'రాజు' అనే పదాన్ని నామమాత్రంగా ఉంచుకున్నా, వారంతా ఆంగ్లేయుల అజమాయిషీలోనే ఉండేవారు. ఆంగ్లేయులకోరికను కాదని, తమ స్వంతంగా ఏదైనా చేయడానికి కూడా వారికి అధికారంలేదు. ఈ విధమైన విదేశీ పెత్తనం కొనసాగడం భారతీయ రాజులకు, మిగిలిన భారతీయ ప్రజలకూ కూడా ఇష్టంలేకపోయింది.

ఆంగ్లేయుల ధాటికి వారు నిలువలేమని తెలుసుకున్నా చివరకు ఆంగ్లే యాధికారాన్ని ప్రశ్నించడానికే నిర్ణయించుకున్నారు. దాని ఫలితమే 1857 సం॥లో భారతదేశమంతటా సంభవించిన స్వాతంత్ర్యోద్యమం. ఇంతటి ఉద్యమాన్ని కూడా ఆంగ్లేయులు తమ విద్యా ప్రణాళికద్వారా, ఏదో కొందరు అసంతృప్తులైన భారతీయ రాజులు చేసిన 'చిన్న తిరుగుబాటు' అని ప్రచారం చేశారు. అదికూడా కేవలం ఉత్తరాది రాజులు మాత్రమేనట! ఈ విధంగా ప్రచారం చేసినప్పటికీ ఆ ఆందోళన సమస్త భారతానికీ సంబంధించినదని వారికి తెలుసు. అప్పటి వైస్రాయి కన్నింగ్, ఈస్టిండియా కంపెనీ అధ్యక్షుడైన ఛార్లెస్ బట్‌కు వ్రాసిన ఉత్తరంలో ఈవిధంగా వ్రాశాడు. 'మనం కొద్దిలో ఆపద తప్పించుకున్నాం. ఇది మొత్తం దేశమంతా చెలరేగిన ఆందోళన'.

అయితే ఇలాంటి జాతీయవాద ఆందోళనను కూడా ఆంగ్లేయులు అణిచివేశారు. ఆ సమయానికి బంకించంద్రుడు 19సం॥ ల వయస్సు బాలుడు. ఆంగ్లేయుల చేతిలో జాతీయవాద ఆందోళన అణచివేయబడ్డ కారణంగా, నిరాశా నిస్పృహలు దేశమంతటా ఆవరించాయి. చాలా మంది భారతీయులు తమకంటే ఆంగ్లేయులు గుణాత్మకంగా అధికులని భావించేవారు. అదే సమయంలో ఆంగ్లేయులు ఆవిరియంత్రాలు, టెలిఫోన్ కనుక్కోవటం లాంటి అనేక శాస్త్ర పరిశోధనల్లో విజయం సాధించి, రోజువారీ జీవితంలో భారతదేశంలో వాటినుపయోగించటం ఆరంభించారు.

ఉంతో సహజంగానే ఆంగ్లేయులు తమకంటే గొప్పవారని భారతీయులు అనుకోవటానికి బలం చేకూరింది.

ఆంగ్లేయులు ఈ పరిస్థితిని చక్కగా ఉపయోగించుకున్నారు. బెంగాల్‌లో ఆంగ్ల విద్యను వ్యాప్తిచేయడానికి హిందూ కళాశాలను కేంద్రబిందువుగా ఎన్నుకున్నారు. 1835 సం॥లో ప్రారంభింపబడిన మెకాలే విద్యావిధానాన్ని ప్రవేశపెట్టడం వలన, కలకత్తా, బొంబాయి, మద్రాసులలో 1857 సం॥లో మూడు నూతన విశ్వవిద్యాలయాల స్థాపన వలన ఆ చర్యకు బలం చేకూరింది. ఆంగ్ల విద్యావ్యాప్తి భారతీయ సామాజిక - ధార్మిక, సాంస్కృతిక రంగాలను దెబ్బతీసింది. భారతీయులు తమ సంప్రదాయాలు, ఆచారాలపట్ల విశ్వాసాన్ని కోల్పోయారు. ఆంగ్లేయులు చెప్పిన ప్రతివిషయమూ సత్యమైందే, నమ్మదగిందే అనే భావన భారతీయుల్లో కలిగింది. ఆంగ్లేయులు భారతీయ ఆచార వ్యవహారాలను సవాల్ చేస్తుండేవారు. అదే భావన ఆంగ్లవిద్య నేర్చిన భారతీయులకు కూడా అలవాటయిపోయింది. ఈ విధంగా సవాల్ చేయటం ప్రగతిశీల ఆలోచనగా పిలువబడింది.

ఆ విధంగా ఎందరో భారతీయులు ఆలోచిస్తున్నా స్వామి దయానంద లాంటి ఎందరో భారతీయులు, భారతీయ సంస్కృతి విశిష్టత పట్ల, వైభవం, వారసత్వంలపట్ల ఏమాత్రం అపనమ్మకం పెట్టుకోలేదు. అలాంటి ఎందరో భారతీయుల్లో బంకించంద్రుడు కూడా ఒకరు.

ఇలాంటి భిన్నమైన మనస్తత్వంతో నిండిన భారతీయ వాతారణంలో బంకించంద్రుడి సాహిత్యగుణం ఒక ఆకారాన్ని దాల్చింది. ఈ దేశంలో ఉన్న పరిస్థితులన్నింటికీ ఆంగ్లేయులే బాధ్యులు అనుకునే వ్యక్తులు దేశంలో చాలా మంది ఉన్నారు. ఆంగ్లేయుల ఆధిపత్యానికి ప్రతి స్పందన అది. అయితే బంకించంద్రుడి పంథా వేరు. 'భారత్ ప్రస్తుత పరిస్థితికి ఆంగ్లేయులు కారణంకాదు. నిజానికి దేశభక్తిలేని భారతీయులే అందుకు కారకులనే సత్యాన్ని' తెలుసుకున్నాడు. చాలామంది తమ మాతృభూమి కోసం పనిచేయడాన్ని మానుకున్నారు. మరికొందరైతే వంచకులుగా కూడా తయారయ్యారు. బంకించంద్రుడి అభిప్రాయంలో కేవలం ఇదొక్క

కారణమే భారత్‌లో ఆంగ్లేయుల ఆధిపత్యానికి , వారి దుర్మార్గాలకు కారణభూతమైంది.

భారతీయుల్లో నెలకొన్న నిరాశను తొలిగించి మాతృభూమికొరకు, ప్రాచీనమైన, వైభవాన్వితమైన దేశంకోసం సమర్పితమయ్యే విధంగా వారిని తీర్చి దిద్దటమే ప్రథమావసరంగా ఆయన భావించాడు. గత శతాబ్దంలో దేశం పట్ల విస్పష్టమైన ఆలోచన, అవగాహన కొందరిలో ఉండేది. అలాంటి వారిలో బంకించంద్రుడు ఒకడు. ఆయన భావనలో జాతీయత అనేది ఈదేశపు మట్టిలోనే ఉంది. జాతీయవారసత్వం, చరిత్ర, నీతిపట్ల ప్రజలలో ఆదరాభిమానాల వలన దానికి బలం వచ్చింది. ఆయన అభిప్రాయం ప్రకారం దైవం తర్వాత మాతృభూమికే ప్రాముఖ్యత నివ్వాలి. ఈ ఏకాగ్రత, ఈ భావాలు మనస్సులో ఉండి శాలివాహన శకం 1797 సం॥ కార్తీక శుద్ధనవమి - 'జగద్ధాత్రి దేవీపూజ' రోజున వందేమాతరం గీతం రూపంలో ప్రకటితమయ్యింది. తన కర్తవ్యనిర్వహణకు కావలసిన జ్ఞానం, దానికొరకు కష్టపడే సంసిద్ధత, ధ్యేయం సాధించి తీర్తాననే ఆత్మవిశ్వాసం ఈ గీతంలో ప్రతిబింబించాయి.

# మాతృపదార్చన

## వందేమాతరం

వందేమాతరం
సుజలాం సుఫలాం మలయజ శీతలామ్
సస్య శ్యామలాం మాతరం ॥వందేమాతరం॥........1

శుభ్రజ్యోత్స్నా పులకిత యామినీమ్
ఫుల్ల కుసుమిత ద్రుమదళ శోభినీమ్
సుహాసినీం సుమధుర భాషిణీమ్
సుఖదాం వరదాం మాతరం ॥వందేమాతరం॥.........2

కోటి కోటి కంఠ కలకల నినాద కరాలే
కోటి కోటి భుజైర్ధృత ఖర కరవాలే
అబలా కేనో మాఁ ఎతో బలే
బహుబల ధారిణీం నమామి తారిణీం
రిపుదల వారిణీం మాతరం ॥వందేమాతరం॥..........3

తుమి విద్యా తుమి ధర్మ
తుమి హృది తుమి మర్మ
త్వంహి ప్రాణాః శరీరే
బాహుతే తుమి మాఁ శక్తి
హృదయే తుమి మాఁ భక్తి
తోమారయి ప్రతిమాగడి మందిరే మందిరే ॥వందేమాతరం॥......4

త్వం హి దుర్గా దశప్రహరణధారిణీ
కమలా కమలదళ విహారిణీ
వాణీ విద్యాదాయినీ, నమామిత్వాం, నమామి కమలాం
అమలాం,అతులాం,సుజలాం,సుఫలాం,మాతరం ॥వందేమాతరం॥......5

శ్యామలాం, సరలాం, సుస్మితాం, భూషితాం
ధరణీం, భరణీం, మాతరం ॥వందేమాతరం॥........6

## భావం

జననీ నీకు వందనం!

పుణ్యప్రదములైన గంగ, యమునాది జీవనదులను కలిగిన దానవు, మధురఫల భరితవు, మలయ పర్వతములనుండి వీచే గాలుల చేత చల్లదనాన్ని పొంది మా సేదతీర్చే వాత్సల్యపూర్ణవు అయిన తల్లీ! నీకు నమస్కరిస్తున్నాను. .....1

స్వచ్ఛమైన తెలివెన్నెల చేత పరవశించిన రాత్రులు కలిగినదానవు. వికసించిన పారిజాత సుమాలతో శోభించే నిత్యమంగళ రూపానివి, దరహాస చంద్రికలతో మాపై ప్రేమామృతాన్ని కురిపించే వాత్సల్యపూర్ణవు, లలిత పదసంభరిత సంభాషణా చతురవు అయిన తల్లీ! నీకు ప్రణామములు ....2

విజయయాత్రా సంరంభోత్సవ సమయంలో అసంఖ్యాక ప్రజల గొంతుకలలో నినదించే జయ జయ ధ్వానానివి(శబ్దానివి) నీవు. కోట్లాది భుజాలపై ధరింపబడిన పదునైన ఖడ్గసముదాయం కల్గినదానవు. అధికాధిక బల సంపన్నురాలవైన, ప్రచండ శక్తి స్వరూపిణివి అయిన నిన్ను అబల అని పేర్కొనటంలో ఔచిత్యం లేదు తల్లీ! శత్రు మూకలను సంహరించగల బలోపేతవైన వీరమాతవు నీవు. ప్రాణికోటి సకల దుఃఖాలను పోగొట్టి తరింపజేయగల దానవు నీవే తల్లీ! ... ..3

నీవు సమస్త జ్ఞానానివి. ధర్మానివి, సకల జీవకోటిలో చేతనా కేంద్రమైన హృదయస్థానానివి. సకల జ్ఞాన సారానివి నీవు. సమస్త జీవుల ప్రాణానివి నీవు. మమ్ములను దివ్యబలసంపన్నులుగా పెంచి పోషించే వీరమాతవు నీవు. అరివీర భయంకరమైన మా భుజాంతర్నిహితమై వున్న శక్తివి నీవేతల్లీ! అమ్మా! మా అందరి హృదయాలలో జనించే భక్తి రూపానివి నీవే. ప్రతి

మందిరంలోను నీ దివ్యమంగళ విగ్రహాన్ని ప్రతిష్ఠించుకొంటాము. .... 4

దశవిధ ఆయుధధారిణి అయిన దుర్గవు నీవు. సకల సంపత్ ప్రదాయిని అయిన లక్ష్మీదేవివి నీవు. పరాపర విద్యా ప్రదాయిని అయిన సరస్వతీ మూర్తివి నీవు. తల్లీ! నీకు అభివాదములు. అనంతైశ్వర్య ప్రదాతవు, అనన్యసామాన్యురాలివి, పుణ్యజలపూర్ణవు, అన్నపూర్ణవు అయిన మాతృమూర్తీ! నీకు వందనములు. ... .....5

సస్యశ్యామలవు, సరళవర్తనివి, మందస్మిత వదనారవిందవు, సకలాభరణ భూషితవు అయిన మాతృమూర్తీ! విశ్వజననీ! నీకు శతాధిక వందనాలు. శతసహస్ర ప్రణామములు. ........6

బంకించంద్రుడు మాతృప్రేమతో వందేమాతర గీతంలో భారతభూమి సర్వసంపన్నత, వైభవంలను, 'సుజల', 'సుఫల', 'సస్యశ్యామల' - అనే పదాలతో పల్లవిలో వర్ణించారు. భారతభూమి ఇంతటి సంపదలతో తులతూగాలంటే అక్కడ నివసించే వారి మనస్తత్వం చందనంలా ఉండాలనే దృఢ సంకల్పం ఆయన మనసులో ఉంది. ఎందుకంటే మలయ పర్వతాలు చందన వృక్షాలకు ప్రసిద్ధి. చందనాన్ని అరగ దీస్తే సుగంధం వెలువడుతుంది. అది గాలిలో కలిసినప్పుడు చల్లదనాన్నిస్తుంది.

భారతభూమిలో సంవత్సరంలో 8నెలలు ఎలాంటి మసురులేకుండా ఆకాశం స్వచ్ఛంగా ఉంటుంది. చల్లని వెన్నెల రాత్రులు ఆహ్లాదాన్నిస్తాయి. సూర్యరశ్మి కావలసినంతగా ఉంటుంది. వర్షపాతం అవసరమైనంత మాత్రమే ఉంటుంది. దాంతో వాతావరణం వింతసోయగాన్ని కల్గి ఉంటుంది. అందువల్ల ఈ భూమి మిగిలిన ప్రపంచదేశాలకన్నా ఒక ప్రత్యేకత సంతరించుకున్నది. ఈ భూమిలో అన్ని పంటలూ పుష్కలంగా పండుతాయి. భారతభూమి కున్న ఈ ప్రత్యేకతలను వర్ణిస్తూ, తల్లికి ఉండే ఎన్నో విశేషణాలు బంకించంద్రుడి మనస్సులో మెదిలి ఈ చరణంలో వచ్చాయి.

పరపాలనతో బలహీన పడటం వలన ఏర్పడిన అప్పటి దేశపరిస్థితులను గమనించి, భారత్‌కు పట్టిన గ్రహణం విడిచిన తర్వాత దృశ్యం ఎలా

ఉంటుందనే విషయాన్ని మూడవ చరణంలో కవి మనముందు ఆవిష్కరించాడు. భారత ప్రజలు శక్తి సంపన్నులై, ఆయుధ ధారులై, శత్రుమూకలను చీల్చి చెండాడుతుండగల్గడం, వాళ్ళు బలహీనులు కారనే దృశ్యం ఆయన కళ్ళముందు సాక్షాత్కరించింది.

తర్వాతి చరణంలో ప్రపంచంలోని అన్ని విద్యలకు మన భారతమాతే జన్మభూమిగా విరాజిల్లుతున్న భావన కవికి మదిలో మెదిలింది. సమాజ జీవనం సరైన పంథాలో ముందుకు సాగటానికి ప్రతివ్యక్తి ఏమిచేయాలి? ప్రతివ్యక్తి కర్తవ్యమేమిటి? ధర్మమేమిటి? వ్యక్తులంతా తమ తమ ధర్మాన్ని పాటించాలనే విషయం భారతదేశంలో చెప్పబడింది. తమ తమ కర్తవ్యాన్ని ఈ మాతృభూమి సేవకై వినియోగించాలనేది ఈ ధర్మానికి చెప్పబడిన అర్థం. మాతృభూమి కోసం పనిచేయటమే నాధర్మం. ప్రాణాలతో ఉండి కూడా మాతృభూమికోసం పనిచేయకపోతే ప్రాణం లేనట్లేనని ఇక్కడివారి కన్పిస్తుంది. మాతృభూమిపట్ల భక్తి కలిగి ఉండటమే ఇక్కడున్న ప్రతి ఒక్కరి సర్వస్వం. భుజాల్లో శక్తి, హృదయంలో భక్తి ఉండటంతో ఇక్కడి వారికి ప్రతి మందిరంలో మాతృభూమి దివ్యమంగళ విగ్రహం కన్పిస్తుంది.

అయిదవ చరణంలో మాతృభూమి స్తోత్రం పఠిస్తున్నప్పుడు కవికి దేవి మూడు రూపాల్లో దర్శనం ఇచ్చింది. 'దశప్రహరణ ధారిణీ దుర్గ', 'కమల దళ విహారిణీ లక్ష్మి', 'వాణీ విద్యాదాయిని సరస్వతి'గా భారతమాతను దర్శించటంతో కవిలో భావావేశం పొంగిపొర్లి ఈ చరణంలో తర్వాతి విశేషణాలు స్ఫురించాయి. అవి 'అమలాం', 'అతులాం','సుజలాం','సుఫలాం','శ్యామలాం','సరలాం','సుస్మితాం','భూషితాం','ధరణీం','భరణీం' ఈ భావాలన్నీ హృదయాంతరంగాల్లో మారు మ్రోగగా వందేమాతరం, వందేమాతరం అంటూ గీతాన్ని పూర్తి చేశాడు బంకించంద్రుడు.

కవి మనస్సులోని 'మాతృభూమే నా సర్వస్వం' అనే భావన కోటికోటి కంఠాలలో నుండి ప్రతిధ్వనించాలంటే వారందరిలోనూ అదే భావావేశం

రావాలి. అప్పుడే కోటికోటి భుజాలతో ఖడ్గధారులై స్వాతంత్ర్య సాధనకు, దేశరక్షణకు సైనికులు దశప్రహరణధారులవుతారు. విదేశీయులచే చీరకొంగు లాగబడుతున్న లక్ష్మీదేవి, వారి చెరనుండి తప్పించుకొని కమలంపై పునఃప్రతిష్టితమవుతుందప్పుడు. విదేశీయుల చేతిలో బానిసగా మారిన సరస్వతీదేవి, వారిచేతులనుండి విముక్తమై ప్రపంచానికి జ్ఞానాన్ని ప్రసరింపజేస్తుంది. శస్త్రశక్తికి, శాస్త్ర శక్తికి, ధనశక్తికి మళ్ళీ పూర్వ వైభవం సంప్రాప్తిస్తుంది.

దాస్యం నుండి భారతదేశం విముక్తం కావాలనే బంకించంద్రుని హృదయంలోని ఆకాంక్ష ఆయన 'కమలా కాంతేర్ దఫ్తర్' అనే నవలలో కన్పిస్తుంది. అందులో ఆయన ఇలా వ్రాశారు. 'నేను ఒడ్డుకు దూరంగా సాగర జలాలపై తేలియాడుతున్న తెప్పపై కూర్చుని ఉన్నాను. చీకటిగా ఉన్న ఒడ్డుపై ఇంకెవరూ లేరు. ఒంటరిగా ఉన్న నేను భయంతో అమ్మా!అమ్మా! అని అరుస్తున్నాను. ఆ సమయంలో క్షితిజంపై అలలలో ఒక మాతృమూర్తి దర్శనమిచ్చింది. చిరునవ్వుతో, ప్రకాశవంతమైన వెలుగులతో దశభుజ, శస్త్రధారి, భూమి స్వరూప, రత్నాలంకృత, సింహవాహిని, శత్రుసంహారిణి అయిన తల్లిని నేను చూశాను. అంతటి శోభాయమానంగా వెలుగొందుతున్న ఆ తల్లి చాలా దూరంగా ఉంది. మనమందరమూ ఆ సాగరజలాల్లోకి దూకి, ఈదుకుంటూ ఆమె వద్దకు చేరుకుంటాము' ఇటువంటి మాతృభూమి స్వరూపం వందేమాతరం అనే గీత రూపంలో కార్తీక శుద్ధ నవమి నాడు స్ఫురించింది. అదృష్టవశాత్తూ ఆయన సంపాదకత్వంలో వెలువడే 'వంగదర్శన్' పత్రిక మరుసటిరోజు అచ్చవుతున్న సమయంలో సరిగ్గా ఆ గీతం సరిపోయేటంత ఖాళీ స్థలం మిగిలిపోయింది. ఆఖాళీ స్థలంలో ఆగీతాన్ని పొందుపరచారు. అది చూసి బంకించంద్రుడు 'గీత మైతే అచ్చయింది. అయితే దానిలో ఉన్న భావం అర్థం కావటానికి 25లేదా30 సంవత్సరాలు పడుతుంది' అన్నారు. జరిగింది కూడా అదే. అతని సన్నిహితులు కొందరు, ఆ గీతంలో సంస్కృత శబ్దాలు ఎక్కువగా ఉన్నాయని ఆక్షేపించినా, 1880 సం॥లో తాను వ్రాసిన 'ఆనందమఠం' నవలలో ఆ గీతాన్ని ఉన్నదున్నట్లుగా పొందుపరచాడు.

భవిష్యత్తులో ఆ గీతానికి, ఆ పదాలకు అత్యున్నత మహత్వం కల్గుతుందనే ఆత్మవిశ్వాసం ఆయనకుండేది. ఆనందమఠం నవలలో ఆ గీతాన్ని పాడుతూ భవానందుడు ఇలా అంటాడు. 'మాకు తల్లిలేదు, తండ్రిలేదు, అన్నా, అక్కలెవరూ లేరు. స్నేహితులు లేరు, భార్యా పిల్లలు లేరు. ఇల్లూ వాకిలి కూడా లేదు. కేవలం మాకున్నదొక్కటే. అదే సుజల, సుఫల, సస్యశ్యామల అయిన మాత. మేమందరం ఆమె సంతానం'. బంకించంద్రుడు ఈగీతం గురించి తన అక్కకొడుకుతో చర్చిస్తూ 'ఈ గీతం శాశ్వతంగా నిలుస్తుంది. ఈ దేశవాసులందరి హృదయాలను ఆకర్షిస్తుంది, జయిస్తుంది' అన్నారు. తన కూతురుతో మాట్లాడుతూ 'ఒకనాటికి ఈ గీతాన్ని వంగభూమియే కాక దేశమంతటా ప్రజలు ఒకే కంఠంతో స్ఫూర్తివంతంగా పాడుతూ నృత్యాల నభినయిస్తారు' అన్నారు. ఆయన చెప్పిన విషయాలు 25లేదా 30 సంll తర్వాత అని చెప్పటంతో ఆయనను 'ద్రష్ట' అంటున్నాం. కానీ వందేమాతరం మంత్ర సామర్థ్యాన్ని దర్శించటానికి అప్పటిదాకా బంకించంద్ర సజీవులుగా లేరు.

# గేయ సంచలనం

1875వ సంవత్సరం నవంబర్‌లో వందేమాతరం గీతం రచింపబడింది. 1876వ సం॥లో యదునాథ భట్టాచార్య అనే కవి ఈ గీతాన్ని మల్హార్ రాగంలో ఖవ్వాలీలో పాడారు. 1882లో ఆనందమఠం ప్రచురితమైంది. వేదిక మీద మొదటిసారిగా 1883లో ఆలపించబడింది. 1885సం॥లో రవీంద్రనాథ ఠాగూర్ దేశిరాగం ఖవ్వాలీ తాళంలో స్వరబద్ధం చేశారు. అప్పుడు ప్రజలకు అది నచ్చిందే కానీ, వారి మనస్సులను హత్తుకోలేదు. 1894 ఏప్రిల్ 8న బంకించంద్రుడు స్వర్గస్థులయ్యారు.

1896లో కలకత్తాలో కాంగ్రెస్ మహాసభలలో రవీంద్రనాథ ఠాగూర్ వందేమాతరం పాడారు. ఆ సమావేశ సమయానికి ఠాగూర్ దేశిరాగంలోనే ఏకతాళ్ లో స్వరబద్ధం చేశారు. ఆ సమావేశంలో మహమ్మద్ రహమతుల్లా సయానీ అధ్యక్షులుగా ఉన్నారు. కాంగ్రెస్ సమావేశ వేదికపై మంగళాచరణ రూపంలో వందేమాతరం పాడటం అప్పటి నుండే ప్రారంభమైంది. అప్పుడే వందేమాతరం రాష్ట్రగీతంగా ఉండాలని చాలా మంది సూచించారు.

ఆకాలంలో భారతీయులమీద ఆంగ్లేయుల అత్యాచారాలు పెరుగుతూనే ఉన్నాయి. 1898లో వైస్రాయిగా వచ్చిన లార్డ్ కర్జన్ కాలంలో ఈఅత్యాచారాలు మరింతగా పెరిగాయి. **ఆయన 1905 జులై 20న బెంగాల్ ను విభజిస్తామని ప్రకటించారు.** మాతృభూమి ఖండింపబడుతుందనే విషయం గమనించి నిద్రిస్తున్న ప్రజానీకానికి మెలుకువ వచ్చింది. నిప్పుమీద ఉన్న నివురు ఎగిరిపోయింది. వేలాది కంఠాలు వందేమాతరం, వందేమాతరం అంటూ గర్జించాయి. 1875లో రచింపబడిన గీతం ప్రజల హృదయాల్లో అంకురించడానికి 1905 సం॥దాకా అంటే 30 సం॥లు పట్టింది. తర్వాత దాని ప్రాముఖ్యత పెరిగింది. భారతీయులకు రణఘోష అయింది.

బెంగాల్ విభజనను వ్యతిరేకించడానికి మహారాజా జ్యోతిర్మోహన్ఠాగూర్ సమావేశం ఏర్పాటు చేశారు. సమావేశానంతరం అందులో ఆమోదించిన

తీర్మానాలను వైస్రాయికి తెలియజేయాలని నిశ్చయించాడాయన. 1905 ఆగస్టు 7న వ్యతిరేకతా దినాన్ని పాటించాలని నిర్ణయించారాయన.

ఆగస్టు 7వతేదీ చారిత్రాత్మకంగా చాలా ప్రాముఖ్యత గల దినం. ఆరోజున కలకత్తా టౌన్‌హాల్‌లో ఎప్పుడూ జరగనంతటి పెద్ద బహిరంగసభ జరిగింది. సముద్రంలో లేచే అలల్లాగా ప్రజలు గుంపు లుగుంపులుగా మధ్యాహ్నా సమయానికి టౌన్‌హాల్ వద్దకు వచ్చేశారు. ఉదయానికే కళాశాలమైదానంలో గుమిగూడిన కళాశాల విద్యార్థులు వందే మాతరం నినాదాలిస్తున్నారు. తర్వాత వారంతా వందేమాతర నినాదాలతో ఊరేగింపుగా టౌన్‌హాల్ వైపు బయల్దేరారు. మొత్తంకలకత్తా నగరమే వందేమాతరం శబ్దంతో మారుమ్రోగింది. ఆ క్షణం నుండే ఆ నినాదం స్వాతంత్ర్యోద్యమ పోరాటానికి పొలికేక అయింది. రవీంద్రనాథ ఠాగూర్ 'స్వదేశీ ఆత్మ'వందేమాతరం ఆకార్నాన్ని పొందింది అన్నారు.



ప్రజల్లో వెల్లువెత్తిన నిరసనను లెక్కపెట్టకనే 1905 సెప్టెంబర్ 1 వతేదీన బెంగాల్‌ను ఆంగ్లప్రభుత్వం విభజించింది. కాబట్టి అక్కడి ప్రజలకు సహజంగానే బాధ కల్గింది.



1905 అక్టోబర్ 16న బెంగాల్ విభజనకు నిరసనగా కలక త్తాలో విదేశీ వస్తు బహిష్కారం, స్వదేశీ ఆందోళన, నిషేధ దినం పాటించాలని నిర్ణయమైంది. ఆరోజు వయో వృద్ధులైన శ్రీ రామేంద్ర సుందర్ త్రివేది ఈ విధంగా ప్రకటించారు. "ఈరోజు ఎవరిం ట్లోనూ వంట చేయరాదు. ఆంగ్లేయులు బెంగాల్‌ను రెండుగా విభజించినా, మా దృష్టిలో మాత్రం బెంగాల్ ఒకటే. ఈరోజు ప్రతిఒక్కరూ గంగా స్నానం చేయాలి. స్నానం చేసి తిరిగి వచ్చేటప్పుడు ఎదురైనవారిలో ఒకరికి రక్ష కట్టాలి". ఆ రోజు ఎవరింట్లోనూ పొయ్యి వెలగలేదు. కలకత్తాలోని వీధులన్నీ ఒకే ఘోష. అది వందేమాతరం. గంగానదికి దారితీసే సందు లన్నీ మనుష్యులతో నిండిపోయాయి. శుభకార్యాన్ని సూచించే శంఖధ్వని మారుమ్రోగింది. స్నానాలు ముగించుకొని వస్తున్న వారిపై స్త్రీలు పూలు

విసురుతున్నారు.

రవీంద్రనాథ ఠాగూర్ అందరితోపాటు గంగాస్నానం చేశారు. ఒకరికొకరు రక్ష కట్టుకున్నారు. పాథర్యాఘాట్ దగ్గర్లో ఉన్న ఒక అశ్వశాలలో పనిచేసే ముస్లింలందరికీ రవీంద్రుడు రక్షలు కట్టారు. ఆ దారం కట్టుకోవటంతో వారిలో బంధుత్వ భావన పురులు విప్పింది. ఒకరినొకరు ఆలింగనం చేసుకున్నారు. ఇటువంటి వేడుకలు మసీదుల్లోనూ జరిగాయి. హిందూ ముస్లింలు రక్షతో దగ్గరయ్యారు.

తర్వాత పెద్ద బహిరంగసభ జరిగింది. సభలో విదేశీ వస్తువులను బహిష్కరించాలని నిర్ణయమైంది. విదేశీ వస్తువులు వాడుతున్న వారికి, తమ సేవలను కొనసాగించమని మంగలి, చాకలి వృత్తులు చేసేవారు ప్రమాణం చేశారు. ఈ విరాట్ సభలో ఠాగూర్ వందేమాతరాన్ని పూర్తిగా పాడారు. ఈ బెంగాల్ విభజన వ్యతిరేక ఆందోళనలో అబ్దుల్ రసూల్, మౌల్వీ అబ్దుల్ ఖాసీం, అబ్దుల్ హుసేన్ తదితర ముస్లిం నాయకులు కూడా పాల్గొన్నారు.

బెంగాల్ మొత్తాన్ని వందేమాతరం ప్రభావితం చేసింది. పంజాబులోని లాహోర్ నుండి వెలువడే 'ట్రిబ్యూన్' పత్రిక 1905 నవంబర్ 25న ఇలా వ్రాసింది. 'బెంగాల్‌లో వందేమాతరంను బెంగాలీలు జయ ఘోష స్వరూపంలో ఉపయోగిస్తున్నారు. పంజాబులో వందేమాతరం పదంతో నమస్కరిస్తున్నారు. కోటికోటి కంఠాల నుండి వచ్చే ఈ వందేమాతరం పాశవికశక్తితో ఎలా బంధితమవుతుంది?'

మోతీలాల్ నెహ్రూ లండన్‌లో ఉన్న జవహర్లాల్‌కు వ్రాసిన ఉత్తరంలో ఇలా వ్రాశారు. "ప్రస్తుతం అలహాబాదులో కూడా వందేమాతరమంటూ నమస్కరిస్తున్నారు. ఆందోళన ఇదే విధంగా సాగితే నువ్వు తిరిగి వచ్చేటప్పటికి భారత్‌లో చాలా మార్పులు చూస్తావు".

దేశభక్తులకు స్ఫూర్తినిచ్చే ఈ గీతం ఆంగ్లేయులకు కంటిలో నలుసైంది. 1905లో వారు దాన్ని పాడరాదని నిషేధాజ్ఞలు జారీ చేశారు. వందేమా

తరం పాడే విద్యార్థులను శిక్షించవలసిందిగా శ్రీముఖాలు జారీ అయ్యాయి రంగపూర్‌లో 200 మంది విద్యార్థులకు 5 రూ.లు జరిమానా విధించారు కూడా. కిశోర్‌గంజ్ మహా విద్యాలయంలోనైతే వందేమాతరం పాడినవారికి ఒక విచిత్రమైన శిక్ష విధించారు. ప్రతి విద్యార్థితో 'వందేమాతరం చెప్పటం మా మూర్ఖత్వానికి నిదర్శనం. ఇది అవమానకరంగా ఉంది' అని 500 సార్లు వ్రాయించారు. ఈ శిక్షా పరిణామం ఎదురుతిరిగి విద్యార్థులు వందేమాతరంతో ప్రభావితులయ్యారు.

విభజన ద్వారా కొత్తగా ఏర్పాటైన తూర్పు బెంగాల్‌కు లెఫ్టినెంట్ గవర్నర్ అయిన ఫుల్లర్ చాలా అక్రమాలు కొనసాగించాడు. తన నిరంకుశ శక్తిని ప్రదర్శించటంలో ఆనందాన్ననుభవించాడు. వందేమాతరం చెప్పిన వారి మీద లాఠీలు వీరవిహారం చేశాయి. చిత్తరంజన్ గుహ ఠాకూర్ మీద లాఠీ ఛార్జి జరిగింది. చాలామందిని కొరడాలతో బాదారు. జైళ్ళలో వేశారు. అయినా భారతీయులు లొంగలేదు. శిక్షపడటం వీరత్వానికి గుర్తుగా, అభినందనలకు మార్గంగా భావించారు. ప్రభుత్వ ఒత్తిడికేమాత్రం లొంగక ప్రభాత్ ఫేరీలు జరిపేవారు. రోడ్లమీద వందేమాతర ఉద్ఘోష చేసేవారు. స్వదేశాన్ని మాతృరూపంలో చూడాలనే తపనతో బిపిన్‌చంద్ర వందేమాతరం అనే వారపత్రికను ప్రారంభించారు.

1905 డిశంబర్‌లో వారణాశిలో కాంగ్రెస్ మహాసభలు జరిగాయి. ఆ సభలకు మితవాది అయిన నామ్‌దార్ గోఖలే అధ్యక్షులు. బెంగాలీ కవయిత్రి, గాయకురాలు అయిన సరళాదేవి చౌధురాణి ఆ సభల్లో పాల్గొన్నారు. ఆమె కంఠం నుండి వందేమాతరం వినాలని అందరికీ కోరికగా ఉంది. కానీ దాన్ని ప్రభుత్వం నిషేధించింది కాబట్టి మితవాది అయిన గోఖలే అందుకు ఒప్పుకోలేదు. సభలకు వచ్చిన వారెవరూ ఆయన మాట వినడానికి సిద్ధంగా లేరు. చివరికి గీతంలో కొంతభాగం పాడటానికి అధ్యక్షుడు బాధపడుతూనే ఒప్పుకున్నారు. ఒక్కసారి ప్రారంభమైన గీతం సగంలో ఎట్లా ఆగుతుంది? సరళాదేవి సంపూర్ణమైన వందేమాతరం పాడారు. ఆవిధంగా కాంగ్రెస్ మహాసభలు వందేమాతరంతో ప్రారంభమైనాయి.

1885లో కాంగ్రెస్ మొదటి సమావేశాలు విక్టోరియా మహా రాణి జయజయకారాలతో ప్రారంభమైతే, 1905లో అవి వందేమాతరంతో ప్రారంభమైనాయి. కేవలం 20 సం॥లలో ఈ మార్పు వచ్చింది. దాదాభాయి నౌరోజీ, సురేంద్రనాథ బెనర్జీ, బిపిన్ చంద్ర, మహర్షి అరవింద లాంటి వారి ప్రయత్నం వల్ల స్వత్వం, స్వాభిమానం జాగృతమైంది.

1906 ఏప్రిల్ 14, 15 తేదీల్లో బెంగాల్ ప్రాంతీయ సమావేశం బారిసాల్‌లో జరపాలని నిర్ణయమైంది. ఆ ఊరు చిన్నదే కానీ స్వదేశీ మరియు విదేశీ వస్తు బహిష్కరణ ఆందోళనల్లో చాలా పురోగమించింది. అక్కడ స్థానిక నాయకుడు అశ్వనీ కుమార్ దత్త. అతడి నేతృత్వంలో సమావేశ ఏర్పాట్లు జోరుగా సాగుతున్నాయి. వందేమాతరాన్ని నిషేధించటం వలన ఆ పాట ప్రజల్లో ఎక్కువ ప్రచారమైంది. బట్టల మీద, పత్రికల మీద, ఉత్తరాల మీద ఎక్కడ చూసినా వందేమాతరం కన్పించేది. అది చూసి ఆంగ్ల ప్రభుత్వం ప్రజలపై అత్యాచారాలు సాగించేది. ఆ అత్యాచారాలకు ప్రజలు ప్రతీకారం తీర్చుకునేవారు కూడా. అలాంటి పరిస్థితుల్లో ఆ సమావేశాలు ప్రశాంతంగా జరుగుతాయని నాయకులకు నమ్మకం లేదు. సమావేశాలు జరగకుండా ప్రభుత్వం ఆటంకాలు కల్పించడానికి ప్రయత్నిస్తోంది. అయినా ఎవరూ వెనుకంజ వేయలేదు. పనిలో అలుపు లేదు. బెంగాల్ అంతటి నుండి వచ్చే దేశభక్త ప్రతినిధులను స్వాగతించటానికి బారిసాల్ సిద్ధమైంది. ఇంతలోనే జిల్లా మెజిస్ట్రేట్ ఇమర్సన్ బహిరంగస్థలాల్లోను, ఊరేగింపుల్లోనూ వందేమాతరం పాడరాదంటూ ఆజ్ఞలు జారీ చేశాడు.

ఈ సంజీవని లాంటి మంత్రాన్ని ప్రజలు పాడకుండా ఉండలేరని ఇమర్సన్‌కు తెలుసు. ప్రజలను అణచివేయడానికి ఇదొక సాకుగా విని యోగించుకోవాలని ఆనందపడ్డాడు. 600 మంది గూర్ఖా సిపాయిలను, పోలీసులను సిద్ధం చేశాడు. తమ కార్యక్రమం సజావుగా జరగటానికి శక్తియుక్తులనుపయోగించాలని స్వదేశీ నాయకులకు తెలుసు. 'ప్రతినిధులను

స్వాగతిస్తున్నప్పుడు వందేమాతరం పాడము' అనే హామీని మేజిస్ట్రేట్‌కు ఇచ్చారు అశ్వనీకుమార్‌దత్త.

ఏప్రిల్ 13వ తెల్లవారింది. వందలాది ప్రతినిధులు జలమార్గంలో బారిసాల్ చేరారు. పడవల్లోనే, వందేమాతరం పాడరాదనే ఆజ్ఞ గురించి వారికి తెలిసింది. అది పాడకుండా పడవలు దిగటానికి వారి మనస్సులు సిద్ధంగాలేవు. కాబట్టి నౌకల్లోనే కూర్చుండిపోయారు. సాయంత్రం సురేంద్ర నాథ్ బెనర్జీ బారిసాల్ చేరారు. అందరూ నిశ్శబ్దంగా ఉండటం చూసి ఆశ్చర్యపోయారాయన. వందేమాతరం విన్పడటంలేదెందుకని అడిగితే స్థానిక నేతలు విషయాన్ని వివరించారు. వందేమాతరం నినాదాలు లేకుండా సమావేశం అనే ఆలోచన ప్రతినిధులు, ప్రజలకు లాగే ఆయనకూ నచ్చలేదు.

అప్పుడొక నిర్ణయం చేశారు. వందేమాతరం పాడము అని స్థానిక నేతలు ఇచ్చిన మాటను స్వాగత కార్యక్రమం వరకే పాటించాలనేది ఆ నిర్ణయం. అందరూ నిశ్శబ్దంగా సమావేశస్థలం చేరారు. సమావేశం రోజు తెల్లవారింది. ఊరేగింపు మీద లాఠీలు ప్రయోగించాలని పోలీసులకు ఆజ్ఞ వచ్చింది. ఊరేగింపు ప్రతినిధుల వసతుల నుండి సమావేశ స్థలం వరకు జరగాల్సి ఉంది. ఊరేగింపు తర్వాత సమావేశానికి అధ్యక్షులుగా బారిస్టర్ అబ్దుల్ రసూల్ ఉండాలి. ఆయన భార్య ఒక ఆంగ్లయువతి. ఒక ఆంగ్లయువతి ఆంగ్ల ప్రభుత్వాన్ని ఎదిరించటం దేశ ద్రోహమనుకోవచ్చు. కానీ ఆమె ధైర్యంగా తన భర్తతోబాటు ఊరేగింపు అగ్రభాగంలో నడుస్తోంది. ఊరేగింపు ఇంకా ప్రధాన రహదారిలోకి రాకముందే, వందేమాతర నినాదాన్ని ఉచ్ఛరించకముందే లాఠీలు ఝుళిపించారు పోలీసులు. దాంతో ఆకాశాన్ని ఛేదించేలా వందేమాతర గర్జనలు విన్పించాయి. లాఠీ దెబ్బలతో రక్తం కారుతూనే ఉంది. అయినప్పటికీ నోటి నుండి వందేమాతరం ఆగలేదు.

ఆ ఊరేగింపులో చాలామంది నాయకులు పాల్గొన్నారు. అమృత బజార్ పత్రిక సంపాదకులు మోతీలాల్ ఘోష్, భూపేంద్రనాథ బసు, అప్పటికి యుక్తవయస్కులైన బిపిన్ చంద్రపాల్, అరవింద ఘోష్ తదితరులున్నారు. వాళ్ళంతా లాఠీ దెబ్బలు తిన్నారు. కొందరినైతే పోలీసులు బూటు

కాళ్ళతో కొట్టారు. వందేమాతరం బ్యాడ్జీలు చొక్కాలపై ఉంటే పోలీసులు లాగిపారేశారు. ఊరేగింపు ముందుకు వెళ్ళకుండా చేశారు. తర్వాత కొందరిని అరెస్ట్ చేశారు. అందులో సురేంద్రబాబు కూడా ఉన్నారు.

పట్టుకోబడిన వారిలో సురేంద్రబాబును వెంటనే మెజిస్ట్రేట్ వద్దకు తీసుకెళ్ళాలనుకున్నారు. అయితే సెలవు దినం కావటం వల్ల మెజిస్ట్రేట్ ఇంటికి తీసుకెళ్ళారు. అక్కడ సురేంద్రబాబు ఇమర్సన్‌తో పోలీసులు చాలా అత్యాచారాలు చేశారని చెప్పారు. ఆ విధంగా చెప్పటం న్యాయస్థానాన్ని అవమానించడమేనని, అందుకు 200 రూ.లు, ఊరేగింపులో పాల్గొన్నందుకు 200 రూ.లు జరిమానా విధించారు.

సమావేశం ఎలాగైనా జరిగి తీరాలనీ, తాను అక్కడ స్వయంగా లేకపోతే గందరగోళం అవుతుందనీ జరిమానా కట్టి విడుదలయ్యాడు సురేంద్రబాబు. అక్కడ సమావేశం ప్రారంభమైంది. అబ్దుల్ రసూల్ ఉపన్యసిస్తూ హిందు, ముస్లిం, ఈసాయిలందరూ ఈ పోరాటంలో కలిసి పనిచేయాలని చెప్పారు. మోతీలాల్ మధ్యాహ్నం జరిగిన లాఠీఛార్జి విషయంపై మాట్లాడారు. ఇలా ఉపన్యాసాలు జరుగుతుంటే వెనుక నుండి వందేమాతరం నినాదాలు విన్పించాయి. ఎందుకంటే అప్పుడే సురేంద్రబాబు సభామంటపంలోకి అడుగు పెట్టాడు. అది చూసి మొత్తం ప్రతినిధులు వందేమాతరమని నినదించారు. సురేంద్రబాబు వేదిక సమీపించి మాట్లాడటానికి ఉద్యుక్తుడయ్యాడు. అయినా ప్రతినిధులిస్తున్న నినాదాల మధ్య ఆయనకు ఆ అవకాశం చాలాసేపటివరకు దొరకలేదు. ఆరోజు ఆయన ఉపన్యాసం తర్వాత ప్రతినిధులు రోడ్లమీద వందేమాతరమంటూ వారి వసతుల కెళ్ళారు.

సురేంద్రబాబుకు అవమానం జరగటంతో బారిసాల్ ప్రజలు చాలా బాధపడ్డారు. సభలో ఒక తీర్మానం ఆమోదించారు. ఏ స్థలంలో ముందురోజున పోలీసులు అత్యాచారాలు చేశారో, అక్కడే ఒక స్మృతిస్థంభం నిర్మించాలని తీర్మానించారు. దీని వలన ఆ స్థలం అందరికీ స్ఫూర్తి స్థాన మవుతుంది. అది అందరికీ సంతోషమై నగదురూపంలోనే గాక ఒంటిపై

న్నున్న నగలను కూడా సమర్పించారు. నరోత్తమ్‌పూర్ నుండి వచ్చిన సరోజినీదేవి తన స్వర్ణ కంకణాలు సమర్పించి, 'బారిసాల్‌లో వందేమాతరంపై విధించిన నిషేధం తొలగించేవరకూ నేను స్వర్ణకంకణాలు ధరించను' అని ప్రతిజ్ఞ చేసింది.

స్వాతంత్ర్యం కోసం పోరాడే నిరాయుధులపైన, వారికి మాట మాత్రంగానైనా ముందు చెప్పకుండా సిపాయిలు జరిపిన ఈ దురాగతం వలన దేశమంతటా ఆగ్రహ జ్వాలలు రగిలాయి. మరుసటిరోజు సమావేశం ప్రారంభమయ్యే సమయంలో అక్కడున్న పోలీసు అధికారి 'కెంప్' వేదిక మీదెక్కి సభ నడపటానికి వీల్లేదని ఆజ్ఞాపించాడు. 144వ సెక్షన్‌ను విధించారు. దాంతో గలభా అవుతుందని నేతలు సభను అర్థాంతరంగా ముగించారు. ముందురోజున లాఠీలతో బాగా కొట్టాం. కాబట్టి ఎవరూ వందేమాతరం పాడరని పోలీసులు అనుకున్నారు. కానీ రెట్టింపు ఉత్సాహంతో వందేమాతరమంటూ ప్రతినిధులు బయటకు వెళ్ళారు. బారిసాల్ సమావేశం మధ్యలో ఆగిపోయినా, దాని వలన దేశం మొత్తం మీద ఒక అగ్నిపర్వతం విస్ఫోటనమైంది.

1906 ఏప్రిల్ 28వ టైమ్స్ ఆఫ్ ఇండియా ఇలా వ్రాసింది. 'బారిసాల్‌లో జరిగిన ఘటన వల్ల ప్రజల్లో ప్రారంభమైన స్వాతంత్ర్యాందోళన మొత్తం దేశమంతా ప్రాకింది. పోలీసుల అత్యాచారాల వల్ల ఒక్క బెంగాల్‌కే కాదు మొత్తం దేశానికే మెలకువ వచ్చింది'. ఈ విషయాన్ని బ్రిటిష్ పార్లమెంట్‌లో చర్చించారు. పోలీసులు ఆ అత్యాచారాలు ఎందుకు చేశారో తెలపమని ప్రతిపక్షాలు ప్రభుత్వాన్ని నిలదీశాయి. తను అవలంబించిన ఈ ధోరణి వలన స్వాతంత్ర్యాందోళన పెరిగిందనే విషయం ప్రభుత్వం వారికి తెలిసొచ్చింది. మొత్తానికి పరిణామమేమంటే అత్యాచారాలు చేయకూడదని, కొత్తగా వచ్చే వైస్రాయికి సూచించబడింది.

ఆనందబజార్ పత్రిక 'బారిసాల్ ఘటన పునరావృతమైతే వందేమాతర నినాదం కోసం ప్రజలు తమ ప్రాణాలైనా సమర్పిస్తారని' వ్రాసింది.

'వంగభాషి' పత్రిక 'వందేమాతరమనేది మృత్యుంజయుని చైతన్యం' అని వర్ణించింది.

1906 ఆగష్టు 6న వందేమాతరం బెంగాలీ, ఆంగ్లభాషల్లో ప్రారంభమైనాయి. 1906 డిశంబర్ 26న కలకత్తాలో జరిగిన కాంగ్రెస్ సమావేశంలో వివేకానందుని శిష్యురాలు సోదరి నివేదిత తన ఊహాప్రకారం తానే స్వయంగా తయారుచేసిన ధ్వజాన్ని ఎగురవేసింది. దానిమీద వందేమాతరం వ్రాసి ఉంది.

1905-1906 మధ్యకాలంలో జరిగిన కాంగ్రెస్ సమావేశాలకు తమిళనాడులో సుప్రసిద్ధ కవి సుబ్రహ్మణ్యభారతి వచ్చాడు. అక్కడ ఆయన సోదరి నివేదితను కలుసుకున్నాడు. సోదరి నివేదితను ఆయన గురువుగా భావించేవాడు.

బిపిన్ చంద్రపాల్ తమిళనాడు ప్రాంతంతో సంబంధాలు కల్గి ఉండేవారు. 1906లో మద్రాసులోని మెరీనా బీచ్‌లో భవ్యమైన బహిరంగసభ జరిగింది. వేలాదిమంది ప్రజలు పాల్గొన్నారు. పోలీసులు గట్టి భద్రతా ఏర్పాట్లు చేశారు. ఆ సభలో బిపిన్ చంద్రుడు మాట్లాడాడు. వందేమాతర నినాదాలు మారుమ్రోగుతూనే ఉన్నాయి. 'భారత్ భాండార్' పేరుతో స్వదేశీ వస్తువులనమ్మే అంగడిని ప్రారంభించారు. స్వదేశీ ప్రచారం చేసే ఒక కార్యకర్త సభ నుద్దేశించి ప్రసంగించారు. వందేమాతర సందేశం కూడా విన్పించబడింది. సుబ్రహ్మణ్య భారతి వ్రాసిన 'త్రిదళ్' అనే కవిత 15 వేల ప్రతులు పంచిపెట్టబడ్డాయి. మద్రాసులో 'బ్రహ్మవాదిన్' అనే ఆంగ్లపత్రిక, 'ఇండియా' అనే తమిళ పత్రిక ప్రారంభమైనాయి. ఇదే సంవత్సరం 'ఇందు ప్రకాశ్' అనే పత్రికలో అరవింద ఘోష్ వందేమాతరం విషయంలో 7 వ్యాసాలు వ్రాశాడు. మరోప్రక్క ఇదే పరిస్థితుల్లో ముస్లింలీగ్ ప్రారంభమైంది.

రాష్ట్రీయ స్వయంసేవక సంఘ సంస్థాపకులు డా. హెడ్గేవార్ నాగపూర్‌లో నీల్ సిటీ హైస్కూల్‌లో చదువుతున్న రోజులవి. వందేమాతరం ఉద్యమం తీవ్రంగా జరుగుతున్న రోజులవి. విద్యార్థులు సభల్లో గానీ,

ప్రదర్శనల్లోగానీ పాల్గొనకూడదని, అలా కాదని పాల్గొంటే వారి పేర్లను ప్రభుత్వానికి పంపించాలని ఒక సర్క్యులర్ వచ్చింది. దాన్ని 'రీస్లే సర్క్యులర్' అంటారు. స్వాతంత్ర్య పోరాటం నుండి విద్యార్థులను దూరంగా ఉంచడానికి ఉద్దేశించిన సర్క్యులర్ అది.

ఈ సర్క్యులర్‌ను వ్యతిరేకిస్తూ, పాఠశాల తనిఖీకిగాను ఇన్‌స్పెక్టర్ వచ్చినప్పుడు ఆయనను వందేమాతరం నినాదంతో స్వాగతించాలనే ఆలోచన డా.హెడ్గేవార్‌కు కల్గింది. ఇన్‌స్పెక్టర్ ఏ తరగతి గదిలోకి వెళ్ళినా వందేమాతరంతో స్వాగతం లభించింది. ప్రతి గదిలోనూ ఈ నినాదమే మారుమ్రోగడంతో పాఠశాల గందరగోళంగా తయారైంది. దీంతో పాఠశాల అధికారులు హెడ్గేవార్‌తో సహా విద్యార్థులందరినీ వందేమాతరం పాడినందుకు పాఠశాల నుండి బహిష్కరించారు. ఈ సంఘటన జరిగినప్పటికి డా. హెడ్గేవార్ వయస్సు కేవలం 17 సంవత్సరాలు మాత్రమే. ఈ సంఘటన 1907లో జరిగింది.

1907 నాటికి బ్రహ్మదేశం భారత్‌లో అంతర్భాగంగానే ఉండేది. తమిళనాడు, ఆంధ్రప్రదేశ్‌ల నుండి వేలాదిగా కార్మికులు వ్యవసాయ పనులకోసం అక్కడికెళ్ళేవారు. అక్కడే నాలుగైదు నెలలుండి పనిచేసి వచ్చేవారు. ఆంగ్లేయులు వారిని ఓడల్లో తీసుకెళ్ళి, తీసుకొచ్చేవారు. ప్రయాణ ఖర్చుల పేరుతో అధిక మొత్తం వసూలు చేయడమేగాక, ఎక్కువమందిని ఒకే ఓడలోకి ఎక్కించేవారు. కార్మికులు ఎదుర్కొంటున్న ఈ బాధలు చూసి స్వదేశీ ఆందోళనలో భాగంగా భారతీయులకు స్వంత ఓడల నేర్పాటు చేయాలని తీర్మానించారు. ట్యూటికోరిన్ నివాసి, ప్రసిద్ధ న్యాయవాది అయిన చిదంబరం పిళ్ళై 'స్వదేశీ స్టీమ్ నావిగేషన్' కంపెనీని ప్రారంభించారు.

ఇది ఆంగ్లేయులకు సవాలుగా మారింది. ఆంగ్లేయులు వ్యాపారదృష్టితో దాన్ని చాలా తీవ్రంగా ప్రతిఘటించారు. ఆంగ్లేయుల నావల్లో ప్రయాణ ఛార్జీలు చాలావరకు తగ్గించారు కూడా. దానికి చిదంబరం పిళ్ళై, సుబ్ర

హ్మణ్యాం శివ వేరే పద్ధతిలో జవాబిచ్చారు. ట్యూటికోరిన్‌లో కొరన్‌మిల్స్ ఉండేది. దాని సంస్థాపకులు, సంచాలకులు ఆంగ్లేయులే. అక్కడ పిళ్ళై, సుబ్రహ్మణ్య శివ కలిసి కార్మికుల ఆందోళన ప్రారంభించారు. అక్కడి కార్మికులకు పిళ్ళై స్వదేశీ స్టీమ్ నావిగేషన్ కంపెనీ కార్మికుల బాధలు కళ్ళకు కట్టినట్లు వివరించారు. 1908 ఫిబ్రవరి 27న కార్మికులంతా సమ్మె చేశారు. వందేమాతరం నినాదంతో అనేక ఊరేగింపులు జరిపారు. దాంతో కార్మికుల కోరికలన్నింటినీ ఆంగ్లేయులు ఒప్పుకున్నారు.

ట్యూటికోరిన్‌లో 15 సం॥ల బాలుడు వందేమాతర మన్నందుకు బెత్త పుదెబ్బల శిక్ష విధించారు. వెంటనే మార్చి 14న 4 వేల మంది ప్రజలు ఊరేగింపు జరిపారు. ట్యూటికోరిన్ చుట్టుప్రక్క గ్రామాల్లో బంద్ పాటించారు. అప్పుడు జరిగిన కాల్పుల్లో తిరుపట్ట కుమార్ అనే బాలుడు మరణించాడు. అతను మరణించే సమయానికి చేతిలో ధ్వజాన్నుంచుకొని వందేమాతర నినాదమిస్తున్నాడు.

చిదంబరం పిళ్ళై 'భారతమాతా సంఘ్' పేరుతో ఒక విప్లవకారీ సమితిని ప్రారంభించారు. దాని ద్వారా వందేమాతరం చాలాసార్లు ప్రచురింప బడింది. అందువలన ప్రజలు వారిని 'వందేమాతరం పిళ్ళై' అనడం ప్రారంభించారు.

తినవళ్ళై జిల్లా మెజిస్ట్రేట్ వించ్, చిదంబరం పిళ్ళైని అవమానపరచి చంపుతానని బెదిరించాడు. 'ఏం చేసినా సరే స్వాతంత్ర్యం కోసం వందేమాతరం పాడి తీర్తానని' పిళ్ళై జవాబిచ్చాడు. దాంతో అతడు అరెస్ట్ చేయబడ్డాడు. ఈ సంఘటనపై సుబ్రహ్మణ్య భారతి రెండు కవితలు వ్రాశాడు. ఒకటి 'శ్వేత ప్రభువు వించ్ కథనం' కాగా రెండవది 'దేశభక్త చిదంబరం పిళ్ళై జవాబు'.

వందేమాతర నినాదం ప్రభుత్వాధికారులకు ఇష్టంలేదనే విషయం పిల్ల లకు కూడా అర్థమైంది. 'కోతి చేతికి మండే అగ్గిపుల్ల' ఇచ్చిన చందమైంది. పోలీసు కన్పిస్తే, అతని ఎదుట వందేమాతరం చెప్పి పారిపోయే

ఆట మొదలెట్టారు.

1857లో జరిగిన స్వాతంత్ర్య సంగ్రామానికి, 1908 మే 10 నాటికి 50 సం॥లు పూర్తయినాయి. ఆరోజు లండన్‌లోని ఇండియా హౌస్ సభాగృహంలో స్వాతంత్ర్య వీర సావర్కర్ నేతృత్వంలో ఒక పెద్ద సభ నేర్పాటు చేశారు. ఆరోజు ఇండియా హౌస్‌కు వెళ్ళే దారంతా వందేమాతర నినాదాలే. సావర్కర్ గంభీరమైన ఉపన్యాసం తర్వాత 'వందేమాతరం' అని ఉద్ఘాటిస్తూ స్వాతంత్ర్య సమరంలో మరణించిన వీరులందరికీ వందనాలర్పించారు.

బెంగాల్‌లో వందేమాతరం అనే పత్రిక 1906 ఏప్రిల్ 6వ ప్రారంభమైంది. దానికి ప్రేరణ 'బ్రహ్మ బాంధవ్' నుండి కలిగింది. మొట్టమొదట హరిదాస్ హలధర్ అనే వ్యక్తి 500 రూ.లు విరాళమిచ్చాడు. వందేమాతరం పత్రిక ధ్యేయ వాక్యంగా 'భారతదేశం భారతీయుల కోసం' అని ఉండేది.

స్వదేశీని ప్రోత్సహించటం, హింసను హింస ద్వారా ఎదుర్కోవటం, అత్యాచారాలకు లొంగకుండా ఉండటం వందేమాతరం పత్రిక ఆదర్శాలు. ఆంగ్లంలో వెలువడే ఈ పత్రికలో భాష, ప్రతిపాదించే శైలి ఆంగ్లేయులను కూడా ముగ్ధులను చేసేది. దానికి మొట్టమొదటి సంపాదకులు బిపిన్‌చంద్రపాల్. ఆయన తర్వాత అరవింద ఘోష్ సంపాదకుడయ్యారు.

ఆ పత్రికలో వచ్చిన వ్యాసాల వల్ల బెంగాల్‌లో చాలామంది యువకులకు దేశభక్తి ప్రేరణ కల్గింది. కలకత్తాలోనే కాదు మొత్తం దేశమంతా ఈ పత్రిక కోసం ఎదురు చూసేవారు. అయితే ఈ పత్రిక నడపటానికి ఆర్థికలోటు ఇబ్బందికరంగా ఉండేది. అందులోనూ ఆలీపూర్ బాంబు కేసులో అరవిందుడు పట్టుకోబడిన తర్వాత ఈ ఇబ్బంది మరీ పెరిగింది. ప్రభావితంగా వ్యాసాలు వ్రాసేవారు చాలామందే ఉన్నా, డబ్బు ఇబ్బందే భరించరానిదయింది. ఈ ఇబ్బందితో పత్రిక ఎలాగైనా ఆగిపోతుందనీ, ఆ ఆగిపోవటాన్ని కూడా పోరాటంలో ఉపయోగించుకోవాలని దేశభక్తులు ప్రణాళిక వేశారు. అప్పటివరకూ దేశభక్తులకు ప్రేరణనిస్తూ, చట్టం చేతికి

దొరక్కుండా జాగ్రత్తగా విషయాలు ప్రచురించేవారు. కానీ తర్వాత నిర్ణయ ప్రకారంగా విజయ ఛటర్జీ ఒక ప్రజ్వలిత సంపాదకీయం వ్రాశాడు. దాంతోటి ప్రభుత్వం ఆ పత్రికను 1908 అక్టోబర్ 29న నిషేధించింది. ప్రతులన్నింటినీ జప్తు చేశారు.

వందేమాతరం పత్రికపై కలకత్తా లాల్ బజార్‌లోని ప్రెసిడెన్సీ మెజిస్ట్రేట్ కింగ్స్ ఫోర్డ్ కోర్టులో కేసు విచారణ ప్రారంభమైంది. దానికై బిపిన్ చంద్రను కోర్టుకు తీసుకువచ్చినప్పుడు ప్రజలంతా వందేమాతర నినాదం చేశారు. పోలీసులు వారిపై లాఠీలు ప్రయోగించారు. లాఠీలు ప్రయోగించమని ఒక అధికారి మాటిమాటికి పోలీసులకు ఆదేశాలిస్తున్నాడు. అది చూసి సహించలేక 15 సంవత్సరాల సుశీల్ కుమార్ ఆ అధికారిని తన పిడికిలితో బాదాడు. అమితమైన వేగంతో, శక్తితో ఆ అధికారిని నేలపై పడద్రోసి పిడిగుద్దులు గుద్దాడు. అందుకు సుశీల్ కుమార్‌కు కింగ్స్‌ఫోర్డ్ 15 బెత్తపు దెబ్బలు శిక్షగా విధించాడు. దెబ్బలు కొట్టేముందు అతని కాళ్ళు చేతులను అతని చొక్కాతోనే కట్టేశారు. ఆయనకు చిత్తరంజన్ గుహ ఠాకూర్ విషయం జ్ఞాపకమొచ్చింది. ఠాకూర్‌కు కూడా వందేమాతరం చెప్పటం వలన ఇదే శిక్ష పడింది. అప్పుడు ఆయన 'వందేమాతర నినాదం వలన నా శరీరంలో మహాశక్తి సంచరిస్తున్నట్లుగా అనుభవాన్ని పొందుతున్నాను. ఈ బెత్తపుదెబ్బలు నాకు 'మాత' యొక్క వరదానంగా, శుభాశీస్సులుగా భావిస్తాను' అన్నారు. ఈ విషయం స్ఫురించి సుశీల్‌కుమార్ ముఖం మీద బెత్తపు దెబ్బల బాధ కన్పించలేదు. వీపు నుండి నెత్తురు కారుతున్నా ఆయన నిర్భయంగా వందేమాతరం చెబుతున్నాడు.

కింగ్స్‌ఫోర్డ్ ప్రజలపై అత్యాచారం చేయటంతో సంతోషించేవాడు. అత్యాచారాలు జరపటంలో సిద్ధహస్తుడు. దాంతో ప్రజలకు ద్వేషం కల్గి అతణ్ణి చంపాలనే పథకాన్ని ఖుదీరాం బోస్, ప్రఫుల్లకుమార్ చక్రవర్తిలకు అప్పగించారు. ఆ పని అప్పగించటంతో వారి ముఖాలపై సంతోషం వెల్లివిరిసింది. కింగ్స్‌ఫోర్డ్‌కు ముజఫ్ఫర్ పూర్‌కు స్థానచలనమైంది. వీరు కూడా అక్కడికెళ్ళారు.

1908 ఏప్రిల్ 30న కింగ్స్‌ఫోర్డ్ బంగళా ముందు మాటు వేశారు. గుఱ్ఱపు బండిలో ఆయన యూరోపియన్ క్లబ్ నుండి ఇంటికి తిరిగి వచ్చే సమయమైంది. గుఱ్ఱపుబండి రావటం చూసి ఖుదీరాం పరుగెత్తుకెళ్ళి దానిపై బాంబు విసిరాడు. ప్రచండ శబ్ధంతో బాంబు విస్ఫోటనమైంది. హిందూదేశ స్వాతంత్ర్య సమరంలో అనుకున్న పని పూర్తిచేసిన మొట్ట మొదటి బాంబు విస్ఫోటనమది. కానీ ఆ బండిలో కింగ్స్‌ఫోర్డ్ లేడు. మరొక యూరోపియన్ ప్రింగ్లే కెనడీ తన కుటుంబంతో ఉన్నాడు. ఖుదీరాం పట్టుకోబడ్డాడు. ప్రఫుల్లకుమార్ తాను సజీవంగా పోలీసుల చేతిలో పట్టుబడరాదని నిర్ణయించుకున్నాడు. తన మీద తుపాకీతో కాల్పులు జరుపుకున్నాడు.

న్యాయస్థానంలో ఖుదీరాం, కెనడీ కుటుంబ స్త్రీలు చావటంతో బాధను వ్యక్తపరచి, ఈ బాంబు కింగ్స్‌ఫోర్డ్ కోసమే వేశానని చెప్పాడు. ఆయనకు ఉరిశిక్ష విధించారు. 1908 ఆగష్టు 11న చిరునవ్వుతో భగవద్గీత చేతిలో పట్టుకొని ఖుదీరాం బోస్ వధ్యస్థానం చేరాడు. వందేమాతరమని గర్జిస్తూ ఉరిత్రాడు మెడకు బిగించుకున్నాడు.

ఖుదీరాం చేసిన ఈ బాంబు విస్ఫోటనంతో బ్రిటిష్ ప్రభుత్వంలో ఒక కంపనం చెలరేగింది. వాళ్ళు ప్రజలపై దమనకాండను మరింత పెంచారు. ఎంతోమందిని జైళ్ళలో పడేశారు. దాంతో యువకుల్లో ఉత్సాహం పెరిగింది. వారు సర్వస్వాన్ని త్యజించటానికి సిద్ధపడ్డారు. వందేమాతర నినాదం వారికి స్ఫూర్తి నిచ్చింది.

ఈ అణచివేత విషయంలో లోకమాన్య తిలక్ తన పత్రికలలో వరుసగా వ్రాయటం ప్రారంభం చేశారు. 1908 జూన్ 24న ఆయనను పోలీసులు అరెస్ట్ చేశారు. 6 సం॥ల పాటు దేశ బహిష్కారశిక్ష విధించారు. ఆయనను బండిలో తీసుకెళ్తున్నప్పుడు, నౌకలోకి ఎక్కిస్తున్నప్పుడు ప్రజలు వందేమాతర నినాదాలిచ్చారు. బొంబాయిలోనైతే స్వయం స్ఫూర్తితో హర్తాళ్ చేశారు. నిరసన ప్రకటించారు. ఆ నిరసన ప్రదర్శనపై కాల్పులు జరపగా

15 మంది అమరులయ్యారు. అయినా వందేమాతర నినాదం ఆగిపోలేదు. అలాంటి సంఘటనే దక్షిణ భారతదేశంలో బెల్గావ్‌లో జరిగింది.

ఇండియా కౌన్సిల్‌లో ఒక సభ్యుడు కర్జన్‌వైలీ. హిందుస్థానీ యువకులను భయపెట్టి, అదుపులో ఉంచుకోవటానికి ఆయన ప్రయత్నం చేసేవాడు. సావర్కార్ బారిష్టర్ అధ్యయనం పూర్తిచేశారు. ఆయన విప్లవకారుడు కాబట్టి ఆయనకు బారిష్టర్ పట్టా ఇవ్వకూడదని వైలీ ప్రయత్నం చేశాడు. లండన్‌లో విప్లవకారులకు పోషకుడుగా ఉన్న పండిత్ శ్యాంజీ కృష్ణవర్మను లండన్‌లో ఉండకుండా వెళ్ళగొట్టే ప్రయత్నం చేశాడు. ఇవన్నీ చూసి మదన్‌లాల్ ధింగ్రాకు కోపం వచ్చింది. నేషనల్ ఇండియన్ అసోసియేషన్ యొక్క సమ్మేళనానికి 1909 జూలై 1 న కర్జన్‌వైలీ వచ్చాడు.

సభ పూర్తి అయిన తర్వాత అందరూ వెళ్ళిపోతున్నప్పుడు ధింగ్రా, కర్జన్‌వైలీ ఎదుటకు వెళ్ళి ఆయన మీద తుపాకీతో కాల్పులు జరిపాడు. కర్జన్‌వైలీ అక్కడే కూలిపోయాడు. పోలీసులు ధింగ్రాను పట్టుకున్నారు. అప్పుడు ధింగ్రా దగ్గర రెండు పిస్తోళ్ళతోబాటు, న్యాయస్థానంలో చెప్పవలసిన తన వాదన సిద్ధంగా ఉంది. ఆ వాదన బైటికి రాకుండా పోలీసులు చాలా ప్రయత్నం చేశారు. కానీ పండిత శ్యాంజీ కృష్ణవర్మ, సావర్కార్ తదితర విప్లవకారుల ప్రయత్నం ద్వారా మొత్తం ప్రపంచంలో ఎన్నో వార్తాపత్రికల్లో 'ఛాలెంజ్' అనే పేరుతో ఉన్న ఈ వాదన ప్రచురితమైంది.

అందులో ధింగ్రా ఇలా వ్రాశారు "దేశభక్త హిందూస్థానీ యువకులను చంపటం, దేశ బహిష్కార శిక్షలు విధించటానికి ప్రతీకారంగా నేను ఒక ఆంగ్లేయుణ్ణి వధించాను. హిందువునైనందున నేను నా ఆలోచన ప్రకారంగా నా దేశం మీద జరిగిన ఆక్రమణకు, ప్రతీకారం తీర్చుకోవడం వల్ల, నా పట్ల దేవుడికి అభిమానమే ఉంటుందనుకుంటున్నాను. తల్లికి సమర్పించటానికి నా దగ్గర స్వంత నెత్తురు తప్ప మరేం లేదు. కాబట్టి దాన్నే నేను సమర్పిస్తున్నాను. ఆత్మ బలిదానం ఎట్లా చేయాలనే పాఠం ప్రస్తుత పరిస్థితిలో హిందూదేశానికి అవసరం. అందువలన మాతృభూమి

విముక్తి అనే పవిత్ర కార్యం పూర్తి అయ్యేంతవరకు ఈ భూమిలో నేను పునర్జన్మించాలి, ఈ పవిత్ర కార్యం గురించి నా ప్రాణం సమర్పించాలి. ఇది ఒక్కటే పరమేశ్వరునికి నా ప్రార్థన. వందేమాతరం."

మాణిక్‌తోలా కుట్ర కేసులో విప్లవకారులతో ఉన్న నరేంద్ర గోస్వామి, మిగిలిన విప్లవకారులకు వ్యతిరేకంగా ప్రభుత్వ సాక్షిగా మారాడు. తద్వారా తను ఆ కేసులో నుండి బయట పడడంతో అతణ్ణి చంపాలని విప్లవకారులు కన్హయ్యాలాల్, సత్యేంద్రనాథ్ బోస్‌లకు ఆ బాధ్యత అప్పగించబడింది. ఆలీపూర్ జైలులోని వైద్యశాలలో పోలీసుల కాపలాలో నరేంద్ర గోస్వామి ఉంచబడ్డాడు. తనకు కడుపునొప్పి ఉందని సత్యేంద్రనాథ్ కూడా ఆ వైద్య శాలలో నరేంద్ర దగ్గరకు చేరిపోయాడు. ఈ కడుపునొప్పి సహించలేను. కాబట్టి నీలాగా నేనూ ప్రభుత్వసాక్షిగా మారతానని నరేంద్రకు విశ్వాసం కల్గించాడు. ఈవిధంగా అతనికి దగ్గరై 1908 ఆగష్టు 31న నరేంద్రను హతమార్చాడు. ఈ సంఘటన దేశప్రజల్లో ఆందోళన రేకెత్తించింది.

మీకు పిస్తోళ్ళు ఎలా దొరికాయని వీరిద్దరినీ పోలీసులు ప్రశ్నించగా ఖుదీరాం యొక్క దయ్యం నాకు పిస్తోల్ నిచ్చిందని చెబుతూ కన్హయ్యాలాల్ పకపక నవ్వాడు. కన్హయ్యాలాల్ పోలీసులకు చెప్పిన ఈ జవాబు విని కలకత్తావాసులు తమ హర్షాన్ని శంఖనాదంతో ప్రకటించారు. బెంగాల్‌లో తమ సంతోషం ప్రకటించటానికి మహిళలు కూడా శంఖనాదం చేసే అలవాటుంది. వాళ్ళు కూడా చేశారు. 'వందేమాతరం' అనే జయ జయ ధ్వానాలతో ఆ ప్రాంతమంతా దద్దరిల్లిపోయింది. న్యాయస్థానంలో వాళ్ళిద్దరూ నరేంద్రుడు దేశద్రోహం చేయటం వల్లనే చంపామని చెప్పారు. వారిద్దరికీ ఉరిశిక్ష విధింపబడింది.

ఉరిశిక్ష విధింపబడిన తర్వాత కన్హయ్యాలాల్ తన అన్నతో ఈ విధంగా చెప్పారు. "నా శవయాత్ర పెద్ద ఎత్తున చేయండి. ఇది నా గౌరవం కోసం కాదు. బెంగాల్‌లో ఎక్కడైతే ఉమీచంద్, మీర్ జాఫర్ లాంటి దేశద్రోహులు

పుట్టారో, ఆ బెంగాల్‌లోనే తన మాతృభూమి కోసం ప్రాణాలర్పించే యువకులు కూడా పుట్టారని నా దేశ వాసులందరికీ తెలియజేయటానికే".

1908 నవంబర్ 10న ఉరి తీయడానికి కన్హయ్యాలాల్‌ను తీసుకెళ్తున్నప్పుడు ఆయన వందేమాతరాన్నే పఠిస్తున్నాడు. కన్హయ్యాలాల్ శవాన్ని స్వాధీనం చేసుకోవటానికి ఎప్పుడైతే ఆయన బంధువులు వచ్చారో వాళ్ళతో జైలు సూపరింటెండెంట్ ఎమర్సన్ 'మీరెందుకు శోకిస్తున్నారు? ఇతని వంటి వీరులు ఏదేశంలో పుడతారు? ఇలాంటి వీరులు పుట్టినదేశం ధన్యమవుతుంది?' అన్నాడు.

కన్హయ్యాలాల్ కోరికను బట్టి ఆయన అంతిమయాత్ర పెద్ద ఎత్తున జరిగింది. వందేమాతరం నినాదాలతో ఆకాశం దద్దరిల్లింది. కన్హయ్యాలాల్ అంతిమయాత్ర భవ్యంగా జరగటాన్ని చూసి సత్యేంద్రనాథ్ శవాన్ని బంధువులకు అప్పగించరాదని ప్రభుత్వం నిర్ణయించింది. 1908 నవంబర్ 21న వందేమాతర నినాదమిస్తూ సత్యేంద్రనాథ్ ఉరితాడు బిగించుకున్నాడు.

ఇదే అనుభవం మాష్టర్ అమీర్‌చంద, బాల ముకుందుడు, అవధ బిహారిల విషయంలో కూడా జరిగింది. చివరిక్షణంలో తనను కలవటానికి వచ్చిన తన భార్య రామసఖితో బాలముకుందుడు "ఈ విశ్వమంతా ఒక మాయ. ఎవరు పుట్టారో వారు మరణించటం ఖాయమే. దేశ స్వాతంత్ర్యం కోసం నేను నా ప్రాణాలను సమర్పిస్తున్నాను. కాబట్టి నువ్వు ధన్యురాలివి" అని ఆమెను ఓదార్చాడు. రాత్రి బాగా నిద్రపోయి 1915 మే 8న ఉదయాన్నే లేచి స్నానాదికాలు, ప్రార్థనలు చేసి వారు సిద్ధమయ్యారు. అప్పుడొక ఆంగ్లేయాధికారి నీ చివరి కోరిక ఏమిటి? అనడగగా బాలముకుందుడు 'బడబానలం వెల్గించి నీతో కలిపి మా పారతంత్ర్యం కూడా అందులో భస్మం చేయాలి. తద్వారా భారతభూమి వైభవోపేతం కావాలనేది' తన కోరిక అన్నాడు. ముగ్గురినీ వధస్థంభంవైపు తీసుకెళ్తున్నప్పుడు వందేమాతరం ఆలపిస్తూ మృత్యువును చేరుకున్నారు.

1908 ఆగష్టు 18వ తేదీ జర్మనీలోని స్టుట్‌గార్ట్‌లో అంతర్జాతీయ సమాజవాదీ పరిషత్ సమావేశం జరిగింది. సమావేశం మొదటిరోజు ప్రతి దేశం వారు తమ దేశ పతాకను ఎగురవేయాలనే సూచన ఉంది. అప్పుడు మేడం కామా భారత్ తరఫున ఎగురవేసిన మూడురంగుల పతాకంలో వందేమాతరం అనే రాష్ట్ర మంత్రం వ్రాసి ఉంది. ఆగష్టు 21న వేదికనెక్కిన తర్వాత మేడం కామా ఆ ధ్వజాన్ని ఎగురవేస్తూ 'ఇది హిందూ దేశపు స్వతంత్ర ధ్వజం. అసంఖ్యాకులైన హుతాత్ముల నెత్తుటితో ఇది పునీతమైంది. అందరూ దీనికి ప్రణామం చేయమని నేను మిమ్మల్ని ఆహ్వానిస్తున్నాను' అన్నారు.

భారత్‌లో వందేమాతరం పత్రిక నిషేధింపబడిన విషయం తెలిసి మేడం కామా తదితర విప్లవకారులు జెనీవాలో వందేమాతరం పక్షపత్రికను ప్రారంభించారు. మొట్టమొదట దానికి లాలాహరదయాళ్ సంపాదకులుగా ఉండేవారు. ఈ పత్రిక జెనీవా నుండి వెలువడుతున్నదని ప్రభుత్వానికి తెలిసింది. దాంతో హాలెండులోని రోటర్ డాం నుండి వెలువరించటం ప్రారంభమైంది.

ఈ పత్రిక క్రింద 'భారతీయ స్వాతంత్ర్యం కోసం వెలువడుతున్న పక్షపత్రిక' అని వ్రాయబడి ఉండేది. అమెరికాలోని శాన్‌ఫ్రాన్సిస్కోలో అక్కడి విప్లవకారులు 'వందేమాతరం ఖల్సా' పేరుతో ఇంకో పత్రిక ప్రారంభించారు. విదేశాల నుండి ఈ పత్రికలు భారత్‌కు వచ్చేవి. లాలాలజపతిరాయ్ సంకల్పంతో ఢిల్లీ నుండి 1920లో వెలువడిన హిందీ దినపత్రిక పేరు వందేమాతరం. బొంబాయిలో 1941లో ప్రారంభమైన గుజరాతీ దినపత్రిక పేరు కూడా వందేమాతరం.

1927 డిశంబర్ 19న అష్ఫాక్‌ను ఫైజాబాద్ జైల్లో, రాంప్రసాద్ బిస్మిల్‌ను గోరఖ్‌పూర్ జైల్లో ఉరి తీశారు. 'కాకోరి దోపిడీ' కేసులో నిందితులుగా ఋజువైనందున వారిద్దరికీ ఉరిశిక్ష విధింపబడింది. అప్పుడు బిస్మిల్ తల్లి అతణ్ణి చివరిసారిగా కలుసుకున్నప్పుడు 'చాలా బలిష్టుడైన

శత్రువుతో ఎంతో ధైర్యంగా స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్న పుత్రుడికి నేను తల్లినైనందుకు ఎంత గర్విస్తున్నానో తెలుసా?' అన్నది.

విప్లవకారులకు ఎప్పుడూ ఆయుధాల కొరత ఉండేది. చిట్టగావ్‌లో ఒక ప్రభుత్వ ఆయుధాగారం ఉండేది. ఆ ఆయుధాగారాన్ని ముట్టడించి ఆయుధాలు సంపాదించాలనే నిర్ణయం జరిగింది. 1930 ఏప్రిల్ 18న సూర్యసేన్, అవంత సింహాల నేతృత్వంలో 15 నుండి 20 మంది యువకులు బయల్దేరారు. ఆ పథకంలో విజయులై ఆయుధాలు సంపాదించారు. చాలామంది ప్రభుత్వాధికారులను చంపారు. మే 6వ తేదీ వరకు అంటే 19రోజుల పాటు పోరాటం సాగింది. కానీ చివరకు విప్లవకారుల సంఖ్యకన్నా ప్రభుత్వ సైనికుల సంఖ్య ఎక్కువకావటంతో విప్లవకారులు చాలామంది పట్టుబడ్డారు. సూర్యసేన్‌కు ఉరిశిక్ష విధించారు.

కన్హయ్యాలాల్‌ను ఉరి తీసినప్పుడు కల్గిన అనుభవంతో సూర్యసేన్‌ను అందరూ నిద్రిస్తున్న సమయంలో ఉరి తీయాలనుకున్నారు. 1934 ఫిబ్రవరి 12న ఆయనను వధ్యస్థానానికి తీసుకెళ్తుంటే వందేమాతర నినాదమిచ్చారు. నిద్రిస్తున్న రాజకీయఖైదీలు ఆ నినాదంతో మేల్కొన్నారు. ప్రతిగా ముక్త కంఠంతో వందేమాతర నినాదమిచ్చారు. ఇదంతా విని పోలీసులకు కోపం వచ్చింది. సూర్యసేన్ జీవితం కొన్ని క్షణాల్లో ముగియబోతున్నా అతణ్ణి స్పృహపోయేంతవరకూ కొట్టారు. చివరకు స్పృహలేని సూర్యసేన్‌ను అలాగే ఉరి తీశారు.

1938 సం॥లో ఆంధ్రప్రదేశ్‌లోని ఉస్మానియా విశ్వవిద్యాలయంలో 'వందేమాతరం సమ్మె' జరిగింది. వసతి గృహాల్లో ఉన్న హిందూ విద్యార్థులెవరూ వందేమాతరం పాడకూడదంటూ ఒక ఆజ్ఞ జారీ అయింది. దాంతో హిందూ విద్యార్థులు వసతిగృహాలనే గాక చివరికి ఉస్మానియా విశ్వవిద్యాలయాన్నే వదలిపెట్టి వెళ్ళాలని తీర్మానించుకున్నారు. 'హిందూ స్టూడెంట్స్ కౌన్సిల్ ఆఫ్ యాక్షన్' అనే ఒక విద్యార్థి సమితి ఏర్పాటైంది.

సమ్మె ప్రారంభమైన తర్వాత ఒక్క హిందూ విద్యార్థి కూడా విశ్వవిద్యాలయ ఆవరణలో కన్పించేవారు కాదు. అక్కడ చదివే హిందూ విద్యార్థుల్లో చాలామంది నాగపూర్ విశ్వవిద్యాలయంలో చేరారు. ఈ విద్యార్థులు చూపిన తెగువకు, జరిపిన సమ్మెకు మురిసిపోయి వీరసావర్కార్ తన చేయూత నిస్తానని మాటిచ్చాడు.

'వందేమాతరం సమ్మె' అనేది ఆషామాషీగా జరిగిన వ్యవహారం లాంటిది కాదు. నైజాం ప్రభుత్వానికి వ్యతిరేకంగా పౌర, రాజకీయ హక్కుల కోసం జరిగిన పోరాటమది. వందలాది విద్యార్థులు పాల్గొన్న ఈ ఉద్యమం పాత హైదరాబాదు రాష్ట్రానికి చెందిన రాజకీయాల్లో ప్రముఖ పాత్ర వహించింది.

1939లో ఆర్య సమాజం వారు ప్రజల ప్రాథమిక హక్కుల కోసం సత్యాగ్రహం చేశారు. నిజాం ప్రభుత్వం జైలులో ఉన్న సత్యాగ్రహుల మీద చాలాసార్లు లాఠీఛార్జి చేసింది. రామచంద్రరావు అనే సత్యాగ్రహి మీద లాఠీలు పడ్తున్నప్పుడంతా వందేమాతరం అంటూ నినదించేవాడు. ఆ దెబ్బలు తింటూ స్పృహ కోల్పోయాడు. అప్పటి నుండి ప్రజలు ఆయనను **'వందేమాతరం రామచంద్రరావు'** అనటం ప్రారంభించారు.

1919 సం.లో అమృత్‌సర్‌లోని జలియన్ వాలాబాగ్‌లో జనరల్ డయ్యర్ నిరాయుధులైన, నిరపరాధులైన భారతీయులను చాలామందిపై కాల్పులు జరిపి చంపాడు. పంజాబు లెఫ్టినెంట్ గవర్నర్ ఓడ్‌వాయర్ ఈ సంఘటనలో డయ్యర్‌కు సహకరించాడు. ఈ హత్యాకాండతో దేశమంతా ఆగ్రహావేశాలు పెల్లుబికాయి. యువకుల రక్తం సలసలా మరిగింది, ఉద్రిక్తమైంది. ఆ భీషణ హత్యాకాండను, గాయాల బాధతో అరుస్తున్న వారినీ ఉధంసింగ్ చూశాడు. అప్పటినుండి ఆయనకు రాత్రిళ్ళు నిద్రపట్టేది కాదు. ఆ హత్యాకాండకు ప్రతీకారం చేయదలచాడు.

అందుకై ఇంగ్లాండు వెళ్ళాడు. అప్పటికి జనరల్ డయ్యర్ మరణించాడని, ఓడ్‌వాయర్ లండన్‌లో ఉంటున్నాడని తెలిసింది. 1940 మార్చి 13న లండన్‌లో కాక్స్టన్ హాల్‌లో ఒక సభలో భారతమంత్రి లార్డ్ జెట్‌లాండ్, సర్

మైఖేల్ ఓడ్వాయర్ మాట్లాడవలసి ఉంది. అక్కడే వారిద్దరినీ హతమార్చాలనే నిర్ణయంతో ఒక పిస్తోలు, ఒక కత్తితో ఉధంసింగ్ సమావేశ హాలుకు చేరుకున్నాడు. సభ పూర్తయిన తర్వాత ముందుకెళ్ళి దగ్గర నుండి ఓడ్ వాయర్పై కాల్పులు జరిపాడు. ఓడ్వాయర్ క్రింద పడిపోగానే జెట్లాండ్పై కాల్పులు జరిపాడు. ఇద్దరూ చనిపోయారు. ఉధం సింగ్ పట్టుకోబడ్డాడు.

కోర్టులో నువ్వేదైనా చెప్పుకోవలసినదుందా? అని న్యాయాధికారి అడిగితే ఉధంసింగ్ ఇలా అన్నాడు 'ఆంగ్లేయుల అన్యాయాలతో భారత్లో తినడానికి తిండిలేక చాలా మంది చనిపోతున్నారు. ఓడ్వాయర్ గవర్నర్గా ఉన్నప్పుడు జరిగిన జలియన్ వాలాబాగ్ హత్యాకాండను నేను చూశాను. ఆ హంతక ఆంగ్లసామ్రాజ్యాన్ని నేను పూర్తిగా ద్వేషిస్తున్నాను. ఓడ్వాయర్ను చంపి ఆ జరిగిన హత్యాకాండకు ప్రతీకారం చేయకుంటే హిందూదేశానికే అవమానం. అందువలన నేను నా మాతృభూమి కోసం బలిదానం చేస్తున్నాను' 1940 జులై 31న ఆయనను ఉరితీశారు. ఈ విధంగా ఎంతోమంది విప్లవకారులు వందేమాతరం నినాదసాక్షిగా తమ జీవన వికసిత పుష్పాలను మాతృభూమి చరణాల వద్ద సమర్పించారు. వందేమాతరం పదాల్లో ఆవిధమైన స్ఫూర్తి, చైతన్యం ఇచ్చే గుణాలు ఉన్నాయి.

# బంగారం ఇనుమయ్యింది.....

ఈ విధంగా ఉజ్జ్వలమైన చరిత్రగల వందేమాతరం ఎందరికో స్ఫూర్తి నిచ్చింది. స్వాతంత్ర్య సమరానికి అది సంజీవనిగా పనిచేసింది. కానీ స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత అది 'రాష్ట్రగీతం' కాలేదు. ఎందుకు?

1905 సం॥ లో కాంగ్రెస్ సమావేశాలకు అధ్యక్షులుగా ఉన్న నామ్‌ధార్ గోఖలే, వందేమాతరం పాట ఆంగ్లేయులకు నచ్చదేమోననే భయంతో పాడటానికి అనుమతి నివ్వలేదు. కానీ ప్రతినిధుల ఒత్తిడితో కొంతభాగం పాడటానికి అనుమతి నియ్యవలసి వచ్చింది. అపుడు అదే అవకాశంగా మొత్తం గీతమే పాడబడిందనే సంగతి ముందే చదివాం.

1923లో కాకినాడలో జరిగిన కాంగ్రెస్ సమావేశాలకు మహమ్మదలీ అధ్యక్షుడుగా ఉన్నాడు. మొదట్లో వందేమాతరం పాడటానికి పండిత విష్ణు దిగంబర పలుస్కర్ తయారైతే , అధ్యక్షుడు వ్యతిరేకించాడు. వారి మాట వినకుండా ఎప్పుడైతే వందేమాతరం పాటపాడటం మొదలైందో, వెంటనే మహమ్మదలీ లేచి సభనుండి బయటకు వెళ్ళిపోయాడు.

అప్పటికి ఖిలాఫత్ ఉద్యమం జరిగి ఎక్కువ కాలం కాలేదు. ఆ ఉద్యమంలో హిందూ,ముస్లింలు బేధం లేకుండా అందరూ వందేమాతరాన్ని పాడుతూండేవారు. అప్పుడు ఏ ముస్లిం కూడా దాన్ని ఆక్షేపించలేదు. షోలాపూర్‌లో అమరులైన నలుగురిలో ఒకరి పేరు ఖుర్బాన్ హుస్సేన్. ఉరిశిక్ష విధించబడుతున్నప్పుడు అతను ఆవేశంతో వందేమాతరం పాడాడు. ఇవన్నీ మరచిపోయి మహమ్మదాలీ దాన్ని పాడేందుకు వ్యతిరేకించాడు.

మౌలానా రేజా ఉల్ కరీం 'బంకించంద్ర - ఓ - ముసల్మాన్ సమాజ్' అనే పుస్తకం వ్రాశాడు. అందులో 'వందేమాతరం అంటే తల్లికి వందనం, తన దేశాన్ని తల్లి అనుకోవటంలో తప్పులేదు' అని వ్రాశాడు.

మౌలానా అకరమ్‌ఖాన్ ఈ పాటను వ్యతిరేకించాడు. కానీ ఆయన వ్రాసిన 'మొస్తాఫా చరితాత్' అనే పుస్తకంలో అరబ్ దేశాన్ని వర్ణిస్తూ ఇలా వ్రాశాడు.

"ధరి యాఘే బక్టే మాగోకర్ పద్‌లేఖా!

హే అరబ్ మానవేర్ ఆది భూమి ॥"

ఈ ఇద్దరు కవులూ ముస్లింలే. వారి రచనల్లో వందేమాతరం లాగా 'ఉమ్మ్-మాతా','ఉమ్మ్-కోరా', 'ఉమ్మల్-మోమేనిన్','ఉమ్మల- కేతాబ్' అనే పదాలున్నాయి. అందులో 'ఉమ్మ్' అంటే తల్లి.

వందేమాతరం పదంలో వారికి మూర్తిపూజ కన్పించింది. మూర్తి పూజను ఇస్లాం ఒప్పుకోదని వారి అభిప్రాయం. దుర్గా, కమల అనే పదాలు మూర్తిపూజా సూచకాలుగా ఉన్నాయనే అభిప్రాయంలో వారుంటే ముస్లిం సాహిత్యకారులు వాడిన 'క్యుపిండ','జౌహరా','అంజరాయిల్','మికాయిల్' ఈ పదాలు దేన్ని సూచిస్తున్నాయి? తల్లి అనే అర్థాన్నే కదా!

1923 కన్నా ముందు వందేమాతరాన్ని ప్రతి సభలోనూ పాడేవారు, నినాదాలిచ్చేవారు. ఇస్లాం మతానికి ఇది వ్యతిరేకంగా ఉంటే ఖిలాఫత్ ఆందోళన సమయంలో మౌలానా మహమ్మదాలీ, షౌకత్ ఆలీ, జాఫర్ ఆలీ, హస్రత్ మూసాని దానిని వ్యతిరేకించేవారు. కానీ అలా చేయకుండా, దాన్ని పాడుతున్నప్పుడు వారంతా గౌరవంగా నిల్చునేవారు. ఎవరైనా నిల్చోకపోతే మహమ్మదాలీ జిన్నాకు కోపం వచ్చేది. ఆ కోపంతో నిష్ఠతో ఆయన గట్టిగా పాడేవారు అప్పుడు వాళ్ళ ఇస్లాం నిష్ఠకు ఏ ఇబ్బంది కలుగలేదు మరి!

రేజా ఉల్ కరీం చెప్పిన మాటలు ముస్లింల మీద ఏ ప్రభావం కల్గించలేదు. కాంగ్రెస్ నేతలు కూడా పాఠాలేవీ నేర్చుకోలేదు. చివరికి 1937 అక్టోబర్‌లో కలకత్తాలో జరిగిన కాంగ్రెస్ కార్యకారిణి

సమావేశంలో ఆ పాటను తగ్గించి అంటే అందులో రెండు చరణాలు మాత్రమే పాడటం ప్రారంభమైంది. అయినా ముస్లింలకు సంతోషం కలుగలేదు. 1938 మార్చి 17న జిన్నా, నెహ్రూతో ఆ పాటమొత్తం తీసివేయాలని చెప్పాడు. దాన్ని జవహర్లాల్ నెహ్రూ ఒప్పుకోక పోతే ఆ విషయమే ఆయన గాంధీతో చర్చించారు. అపుడు గాంధీజీ ఇలా వ్యాఖ్యానించారు "హిందూ - ముస్లింలు ఒక చోట చేరినపుడు వందేమాతరం పాడటం మీద కొట్లాడటం సహించలేను. బహిరంగస్థలాల్లో దాన్ని పాడరాదు". ముస్లింల ఒత్తిడి కారణంగా గాంధీజీతో సహా కాంగ్రెస్ నాయకులందరి అభిప్రాయాలు మారుతూ వచ్చాయి.

వందేమాతరం పట్ల ముస్లింల వ్యతిరేకత కొనసాగుతూనే ఉంది. 1937 జులైలో కాంగ్రెస్ వేర్వేరు రాష్ట్రాల్లో మంత్రి వర్గాలను ఏర్పరచింది. అదే సమయంలో ముస్లింలు పిర్‌పూర్ నవాబు అధ్యక్షతన ఒక కమిటీని ఏర్పాటు చేశారు. ఈ కమిటీ తన నివేదికను 1938 నవంబర్ 15న సమర్పించింది. అప్పటికి అఖిల భారతీయ కాంగ్రెస్ కు అధ్యక్షులైన డా. రాజేంద్రప్రసాద్, ఆ కమిటీ సమర్పించిన నివేదికలోని అబద్ధపు ఆరోపణలను ఎత్తి చూపించారు.

"రెండు మహత్వపూర్ణమైన వర్గాల మధ్య ఘర్షణకు ఒక కారణం వందేమాతరం పాట అని చెప్పారు. ఈ పాట గతశతాబ్దపు 8వదశకంలో రచింపబడింది. ఈ శతాబ్ద ప్రారంభం నుండి బెంగాల్ మాత్రమే గాక అన్ని ప్రదేశాల్లో అందరికీ అది ప్రీతి పాత్రమైంది. అప్పటి నుండి కాంగ్రెస్ మరియు ఇతర సమావేశాల్లో అది నియమితంగా పాడబడుతోంది. బారిష్టర్ జిన్నా గత 15 సంIIలనుండి కాంగ్రెస్‌లో ప్రముఖకార్యకర్తగా ఉన్నారు. అప్పుడు ఎన్నోసార్లు ఈపాట పాడబడినప్పటికీ ఆయన దీనిపై ఏవిధమైన ఆరోపణ చేయలేదు. ఖిలాఫత్ ఆందోళన కాలంలో దేశమంతటా పాడబడింది. కానీ అప్పుడు దాన్నెవరూ వ్యతిరేకించలేదు. ఇప్పుడు మాత్రం వ్యతిరేకిస్తున్నారు"

అని రాజేంద్రప్రసాద్ వ్యాఖ్యానించారు.

గాంధీజీ 1923 సం॥వరకు తను వ్రాసే ఉత్తరాల ప్రారంభంలో వందేమాతరం అని వ్రాసేవారు. 1927 సం॥వరకు వందేమాతరం ఒక అఖిలభారతీయ గీతమని ఆయన అభిప్రాయం. 1938 మే నెలలో మహాత్మాగాంధీ తన 'హరిజన్' పత్రికలో ఇలా వ్రాశారు. "నా బాల్యంలో మొదటిసారిగా వందేమాతరం విన్నప్పుడు సంతోషంతో రోమాం చితుడినయ్యాను. దురదృష్టవశాత్తూ ప్రస్తుతం పరిస్థితులు మారిపోయాయి. బంగారం ఇనుముగా మారిపోయింది........అయితే వందేమాతరం గీతం మాత్రం కోట్లాది భారతీయులను రోమాంచితుల్ని చేస్తూనే ఉంది. భారతజాతి కొనసాగినంతకాలం వందేమాతరం ఉంటుంది.

1937-38 మధ్య కాలంలో భారతదేశం స్వతంత్రమవుతుందని అనుకో వటం ప్రారంభమైంది. స్వాభావికంగా రాష్ట్రగీతం విషయంలో ఆలోచనలు మొదలయ్యాయి. రాష్ట్రగీతం కావటానికి వందేమాతరం యోగ్యంగా ఉందా లేదా? అని నిర్ణయించటానికి ఒక కమిటీని కాంగ్రెస్ కార్యకారిణి నియమిం చింది. అందులో రవీంద్రనాథ్ ఠాగూర్, మౌలానా అబుల్ కలామ్ అజాద్, సుభాష్ చంద్రబోసు, జవహర్‌లాల్ నెహ్రూ ఉన్నారు. ముస్లింలు వ్యతిరే కిస్తుంటే, కాంగ్రెస్ నేతలు వందేమాతరంను రాష్ట్రగీతంగా ఒప్పుకోవటం అసంభవం. కానీ ప్రజల అభిప్రాయంలో వందేమాతరం మొత్తం భారత్‌కే ప్రేరణ ఇచ్చింది కాబట్టి అదే రాష్ట్రగీతం కావాలి. ఆవిధంగా ప్రయత్నాలు కూడా చేస్తున్నారు. ఆ ప్రయత్నాలకు మాస్టర్ కృష్ణారావు కులంబ్రీకర్ నేతృత్వం వహించారు.

రాష్ట్రగీతం కావటానికి కొన్ని విషయాలు అవసరం అని రాజకీయ నాయకులు వంకలు పెట్టారు. అందరూ సాంఘికంగా పాడటానికి సులభంగాను, సంచలనానికి యోగ్యంగాను ఉండాలి. అందులో దేశప్రేమ ఉండాలి. రాజకీయనాయకులు లేవనెత్తిన వంకలు నిరాధారాలని తేల్చిచెప్పటా

నికి ప్రజలు ఎవరికీ సందేహంలేదు. ఆనందమఠం నవలలో వందేమాతరం మల్లార్ రాగంలో తాళబద్ధం చేయబడింది. కాఫీ మరియు సారంగ రాగాల్లో కూడా అది పాడబడింది. ఝింజౌటి రాగం నుండి కొన్ని స్వరాలు ఎంపికచేసి అందరూ పాడగలిగే పద్ధతి లో వాటిని కృష్ణారావు తయారుచేశారు. ఆ రాగంలోనున్న పాట మర్నాటిప్రొద్దున శాంతారామ్ వాపుకు పాడి చూపించారు. ఆయన దాన్ని మెచ్చుకున్నారు. వాద్యాల నుపయోగించి పాడారుకూడా.

అది సంచలన గీత్ అవటానికి, యోగ్యత చేకూర్చే దృష్టితో కృష్ణారావు కొన్ని రోజులు పోలీస్ పెరేడ్‌ను చూసి, వందేమాతరం పాట, స్లోమార్చ్ కోసం యోగ్యంగా ఉందని నిర్ణయించుకున్నారు. అందుకవసరమైన సంగీత స్వరాల్లో తయారు చేశారు.

ఢిల్లీలో రాష్ట్రగీతం విషయంలో చర్చనడుస్తుంటే మాస్టర్ కృష్ణారావు నెహ్రూకు టెలిగ్రాం ఇచ్చి ఒక సంగీతజ్ఞుడనైన నా అభిప్రాయం కూడా పరిశీలించమన్నారు. నెహ్రూ ఒప్పుకున్న తర్వాత ఆయన ఢిల్లీ వెళ్ళారు. నెహ్రూ,సర్దార్ పటేల్, రాజేంద్రప్రసాద్ తదితరుల సమక్షంలో తను అనుకున్న రాగంలో కృష్ణారావు వందేమాతరం పాడారు. అందరికీ అది నచ్చింది. ఒక బెంగాలీ నేత 'బెంగాల్‌లో వాడుకలో ఉన్న రాగం కన్నా, ఈ రాగం సామూహిక గానానికి యోగ్యంగా'ఉందన్నారు.

వందేమాతరం బాండ్‌మీద పాడటం అసంభవమని నెహ్రూ అభిప్రాయం. జనరల్ కరియప్ప సహకారం తోటి సైనిక బాండ్‌లో అది సాధ్యమవుతుందా! అని పరీక్షించారు. అది బాండ్ మాస్టర్‌కు బాగా నచ్చింది. అయినప్పటికీ దానికి అనుమతి నిరాకరించబడింది. ఆంగ్లవిద్వాంసులు దానికి ఒప్పుకోకపోతే అనుమతి రాదనిపించింది. ఆ ప్రయత్నాలు చేయటానికి కృష్ణారావు ఢిల్లీకి వెళ్ళారు. అపుడు రాజేంద్రప్రసాదు 'ఈ ప్రయత్నం బొంబాయి లో చేయండి' అని చెప్పారు.

బొంబాయిలో నావికాదళానికి బాండ్ మాస్టర్ సి.ఆర్.గార్డ్నర్ అనే ఆంగ్లేయుడు ఉండేవాడు. ఆయనను కలిసి ప్రయత్నాలు చేయగా, ఆంగ్లేయుల బాండుమీద అది చక్కగా వాయించబడింది. గార్డనర్ ఆ పాటను చాలా ప్రశంసించారు. ఆయన పదవీ విరమణ చేసి ఇంగ్లాండు వెళ్ళిన తర్వాత ఈ పాట విషయంలో కృష్ణారావుకు ఉత్తరాలు వ్రాస్తుండేవారు. ఒక ఉత్తరంలో ఆయన ఇలా వ్రాశారు. "ఇక్కడ కూడా దాన్ని బాండ్ మీద వాయించాం. ఆ వాదన తాళబద్ధంగా, చాలా సుమధురంగా ఉన్నది, జనగణమన పాట ఆవిధంగా లేదు"

మళ్ళీ కృష్ణారావు నెహ్రూకు ఉత్తరం వ్రాసి 'ఆంగ్ల వాద్యసంగీతం మీద వందేమాతరం పాట ధ్వని ముద్రితమైంది. మీకొకసారి విన్పించే అవకాశమివ్వండి' అని కోరారు. నెహ్రూ సమయమిచ్చాడు. కానీ నిర్ణయమైన సమయంలో నెహ్రూ కలవలేదు. మళ్ళీ రాత్రి కలవమన్నారు. రాత్రికి వెళ్తే ఆయన షేక్ అబ్దుల్లా బక్షీ గులాం తోటి మాట్లాడుతున్నారు. మళ్ళీ మరుసటిరోజు సాయంత్రం పిలిచి రాజ్యాంగ నిర్ణాయక సమితి సదస్యుల ముందు విన్పించమన్నారు.

రాజ్యాంగ నిర్ణాయక సమితి సభ్యులకు అదిబాగా నచ్చింది. కానీ పండిత నెహ్రూ జనగణమన పాట విషయంలో మీ అభిప్రాయమేమిటని కృష్ణారావును అడిగారు. దానికి కృష్ణారావు 'అది నేను రేడియోమీద విన్నాను. నాకు అది అంతగా నచ్చలేదు. వందేమాతరంలో మాతృత్వ భావన ఉంది. అయితే జనగణమన లో పితృత్వభావన ఉంది. మాతృత్వభావన ఎల్లప్పుడూ శ్రేష్ఠంగా ఉంటుంది' అన్నారు. అపుడు బాపూసాహెబ్ గుప్తే 'వందేమాతరంను కూడా మేం రాష్ట్రగీతంగా నిర్ణయిస్తాం'అన్నారు. నెహ్రూమాత్రం వందేమాతరంకు సముచిత స్థానం ఇస్తాం అన్నాడు. ఈ సంఘటన 1948లో జరిగింది. అంటే రాజ్యాంగ నిర్ణాయక సమితి పని పూర్తయ్యేముందు అన్నమాట. అప్పుడే 'జనగణమన'వి

నెహ్రూ తన మనస్సులో రాష్ట్రగీతంగా నిర్ణయించారని అర్థమైపోయింది. చర్చింపబడకుండానే ఆ నిర్ణయం జరిగింది.

అప్పుడున్న పరిస్థితిలో ఈ నిర్ణయం చేయటం అవసరమైందేమో! 1929 డిసెంబర్ 31న పండితనెహ్రూ అధ్యక్షుడుగా ఉన్న కాంగ్రెస్ సమావేశంలో 'సంపూర్ణస్వరాజ్యం' తీర్మానాన్ని చేసి, ప్రతిజ్ఞ చేసినపుడు, చివరన వందేమాతరం పాడారు. అందువలన స్వరాజ్యం గురించిన ప్రతిజ్ఞ, వందేమాతరంల మధ్య అనుబంధం పెరిగింది. అయితే మాతృభూమిని ఛిన్నాభిన్నం చేసి, దుర్బలంగా, ఖండితంగా చేసిన తర్వాత, మాతృభూమి మీద ఉదాత్తమైన ప్రేమతో నిండిన వందేమాతరం పాడితే అఖండ భారతం యొక్క దృశ్యం కళ్ళముందు సాక్షాత్కరిస్తుంది. అది బాగా ఉండదని నెహ్రూ అభిప్రాయమేమో! అందువల్ల రాజ్యాంగ నిర్ణాయక సమితి అభిప్రాయాన్ని అడక్కుండా 1948 మే 2 8న ఆ సమితి సమావేశంలో నెహ్రూ ఇలా చెప్పాడు. "1947 లో న్యూయార్క్‌లో జరిగిన ఐ.రా.స. సమావేశంలో భారతరాష్ట్రగీతం విషయంలో త్వరితంగా నిర్ణయం తీసుకొని చెప్పాల్సి వచ్చింది. అపుడు అక్కడున్న మన ప్రతినిధి వద్ద జనగణమన పాట ధ్వని ముద్రిక ఉండింది. దాన్ని వారు బ్యాండ్ మీద వాయించటానికిచ్చారు. ఆ వాదన అక్కడున్న వారందరికీ నచ్చింది. ధ్వని ముద్రికను భారత్‌కు పంపించారు. ఇక్కడ కూడా మన సైన్యపు బ్యాండుమీద వాయించటం జరిగింది. విదేశాల్లో ఉన్న మన రాయబారులు అదేపాటను ఉపయోగించటం ప్రారంభించారు. విదేశీయులు కూడా ఆపాట చాలా బాగుందని వ్రాశారు.

అప్పుడు మా వద్ద అదేపాట ఉండటం, మంచిరాగంతో ఉన్న మరో పాట ఇంకొకటి లేకపోవటంతో దాన్నే విదేశాలకు పంపించాము. భారత్‌లో ఉన్న రాష్ట్ర గవర్నర్లందరితో నేను రాష్ట్రగీతం విషయంలో చర్చించాను. బెంగాల్ గవర్నర్ మినహా మిగిలిన అన్ని రాష్ట్రాల గవర్నర్లు 'జనగణమన'ను సూచించారు. బెంగాల్ గవర్నర్ మాత్రం వందేమాతరం సూచించారు.

రాష్ట్రగీతం విషయంలో పదాలకన్నా రాగానికి ఎక్కువ మహత్వముంటుంది. రాష్ట్రగీతం యొక్క మహత్వం స్వదేశంలో కన్నా విదేశాల్లో ఎక్కువ ఉంటుంది. విదేశీయులకు జనగణమన రాగమే బాగా నచ్చింది. విదేశీబ్యాండు మీద వందేమాతరం వాయించటం చాలా కష్టం అందువల్ల అది లాభం లేదని కొందరన్నారు.

1950 జనవరి 24 తేదీ రాత్రి జరిగిన రాజ్యాంగ సమితి సమావేశంలో జనగణమన ను రాష్ట్రగీతంగా నిర్ణయించారు. ఆ సభ రాత్రి 11గం.లకు జరిగింది. బాబు రాజేంద్రప్రసాద్ అధ్యక్షులుగా ఉన్నారు. ఆ సమావేశంలో నిర్ణయించవలసిన అంశం రాష్ట్రగీతం ఏది? అనేదొకటే. ఆ సమావేశంలో తమతమ అభిప్రాయాలు వ్యక్తం చేయటానికి అవకాశం దొరుకుతుందని రాజ్యాంగ సమితి సదస్యులు భావించారు. కానీ అధ్యక్షులు రాజేంద్ర ప్రసాద్ లేచి ఇలా చెప్పారు "సభలో చర్చించటానికి రాష్ట్రగీతం విషయమొకటే ఉంది. సమావేశంలో చర్చించి తీర్మానం ఆమోదించాలని మొట్టమొదట అనుకున్నాం. కానీ అట్లా చేయకుండా ఆ విషయాన్ని నేనే ప్రకటించాలని నిర్ణయించాము. నిర్ణయ ప్రకారం జనగణమన భారతదేశానికి రాష్ట్రగీతంగా ఉంటుంది. అవసరమొస్తే ఈ పాటలోని పదాల్లో మార్పులు చేసే అధికారం ప్రభుత్వానికుంటుంది. భారతీయ స్వాతంత్ర్యపోరాటంలో చారిత్రాత్మకంగా ఉపయోగింపబడిన వందేమాతరం పాట, జనగణమన పాట స్థాయికి సమానంగా ఉంటుంది. సభ్యులందరికీ ఈ నిర్ణయం నచ్చుతుందని భావిస్తాను'

ఈ విధంగా చర్చించకుండా 'మేం చేసిందే తుది నిర్ణయం' అనే విధంగా మన రాష్ట్రగీతం నిర్ణయమైంది. అపుడు అనేకమంది వార్తాపత్రికల్లో వ్యాసాలు వ్రాసి ఎన్నో ప్రశ్నలు లేవనెత్తారు. వాటిలో కొన్ని ఇక్కడ చెప్పుకోవటం అవసరం.

* వందేమాతరం కు సరైన రాగం లేదని నిర్ణయించిన వారెవరు?

* రాగం కోసం రాష్ట్రగీతాన్ని మార్చిన దేశం ప్రపంచంలో ఏదైనా ఉందా?

* వందేమాతరం కు సరైన రాగం తయారు చేసేందుకు ప్రభుత్వం గానీ, కాంగ్రెస్ లేదా పండిత నెహ్రూగానీ ప్రయత్నించారా?

* జనగణమన పాట రికార్డు ఐక్యరాజ్యసమితి సమావేశానికి ఎవరు పంపారు?

* అనుకోకుండా ఐక్యరాజ్యసమితి సమావేశంలో చూపాల్సి వచ్చింది అన్నారు. అయితే దాన్ని ఎవరు, ఎప్పుడు, దేనికోసం తయారు చేశారు?

* ఈ రికార్డ్ విదేశానికి తీసుకెళ్ళే అధికారం వారికి ఎవరిచ్చారు? ఏ నియమానుసారంగా ఇచ్చారు? దాని విషయంలో ప్రభుత్వం వద్ద ఏదైనా ఆధారముందా? ఉంటే దాన్నెందుకు ప్రకటించలేదు?

* విదేశీ బ్యాండ్ మీద వాయించి పరీక్షిస్తేనే రాష్ట్రగీతంగా ఉండే అర్హత ఉంటుందని ఎవరు నిర్ణయించారు? సరే. అది అంతగా అవసరమని భావించిన తర్వాత మాస్టర్ కృష్ణారావు ప్రయత్నించి పోలీసు, మనసైన్యం మరియు ఇంగ్లాండులో బ్యాండ్ మాస్టర్ గార్డనర్ దగ్గర నుండి వందేమాతరంకు సర్టిఫికెట్ తెచ్చినప్పటికీ దాన్ని నెహ్రూ ఎందుకు ఒప్పుకోలేదు?

* మన రాష్ట్రగీతం యొక్క రాగం విదేశీయుల నిర్ణయాన్ని బట్టి ఉండాలని ఎవరు భావించారు?

* ఇంతటి మహత్వమైన రాష్ట్రగీతం విషయాన్ని చర్చించటానికి రాజ్యాంగ సమితి సభ్యులకు ఎందుకు అవకాశమివ్వలేదు?

* సభ్యులు చర్చించకుండా రాజ్యాంగసమితి అధ్యక్షుడు చెబితే చాలని నిర్ణయించినదెవరు? ఎందుకు?

ఇటువంటి ప్రశ్నలు చాలా మంది అడిగారు. ఈ విషయమై బహిరంగ సభలు కూడా జరిగాయి. అఖిల భారతీయ విద్యార్థి పరిషత్ ప్రజాభిప్రాయ సేకరణ జరిపింది. అందులో 95శాతం ప్రజలు వందేమాతరమే రాష్ట్రగీతం కావాలని కోరుకున్నారు. అరవిందాశ్రమంకు సంబంధించిన పత్రికలో దీనికి సంబంధించిన పెద్ద వ్యాసమే వచ్చింది. వీటన్నిటికీ జవాబివ్వక అప్పటి దేశనేతలు వారిష్ట ప్రకారంగానే ప్రవర్తించారు.

వందేమాతరాన్ని రాష్ట్రగీతం చేయకుండా, ఏ గీతాన్నైతే కొందరు దేశనాయకులు రాష్ట్రగీతంగా నిర్ణయించారో, ఆ జనగణమనకున్న చరిత్ర ఏమిటి?

**1911 డిసెంబర్ 27న కలకత్తా కాంగ్రెస్ మహాసభలలో మొట్టమొదటసారిగా రవీంద్రనాథ్ ఠాగూర్ తాను రచించిన జనగణమన పాట పాడారు.** ఆరోజు ఆ సమావేశం ఇంగ్లాండు నూతన రాజుగా పట్టాభిషిక్తుడైన అయిదవ జార్జిని ఎట్లా సత్కరించాలని నిర్ణయించటానికి కేటాయించబడింది. మరుసటిరోజు అంటే డిసెంబర్ 28న 'స్టేట్స్‌మన్' మరియు 'ఇంగ్లీష్‌మన్' పత్రికలు ఆ కార్యక్రమాన్ని వర్ణిస్తూ చక్రవర్తిని (అయిదవ కింగ్ జార్జ్) గౌరవించటానికి రచింపబడిన పాటను రవీంద్రనాథ ఠాగూర్ పాడారని వ్రాశాయి.

ఏదైతే బ్రిటిష్ ప్రభుత్వం వందేమాతరం పాడటం దేశద్రోహమని భావించిందో, అదే ప్రభుత్వం జనగణమన పాడించటానికి సహకరించింది. ప్రభుత్వం నడిపించే పాఠశాలల్లో మరియు బ్రిటిష్ రాజును గౌరవించే 'స్కౌట్ పథక్' లలో ఆ పాట పాడించేవారు. భారతదేశాన్ని వదిలివెళ్తున్నప్పుడు ఆంగ్లేయులు భారతదేశానికి ఒక యుద్ధవిమానం కానుకగా ఇచ్చినప్పుడు ఈ పాట పాడబడింది. ఆంగ్లేయులకు అనుకూలంగా ఉండేవారు ఈ పాటను ఎక్కువగా ఉపయోగించేవారు.

ఈ చరిత్రను చూస్తే, వందేమాతరం పాటతో సమానమవటానికి కావలసిన అర్హత జనగణమనకు ఏమాత్రం లేదు. అది భారతీయ దేశభక్తుల హృదయాలకు హత్తుకోదు.

ఇంత దేశభక్తితో కూడిన చరిత్ర ఉన్న వందేమాతరంకు బదులుగా దేశభక్తి చరిత్రే లేని జనగణమన రాష్ట్రగీతం కావటం చాలా మంది దేశభక్తులకు బాధకల్గించి ఉండవచ్చు. కానీ ఒకసారి రాజ్యాంగసమితి నిర్ణయించిందికదా! అనే భయం ఉంటుంది. కానీ ఆ భయం అనవసరం. రాజ్యాంగమనేది ప్రజలకోసం ఉండాలి. ప్రజలు రాజ్యాంగం కోసం ఉండరు. ప్రజా సంక్షేమం దృష్ట్యా రాజ్యాంగం మారుతుంటుంది. ఇప్పటికి మన రాజ్యాంగాన్ని 80 సార్లు అవసరమైన మార్పులు చేశారు. మనది ప్రజాస్వామ్య దేశం. వందేమాతరం పట్ల దేశ ప్రజలకు ప్రగాఢ భక్తి శ్రద్ధలుంటే ఇప్పుడు రాజ్యాంగ సవరణ చేసైనాసరే దానికి రాష్ట్రగీతం స్థానమివ్వటానికి అవకాశం ఉంది.

కావున ప్రజలు ఈ నిర్ణయం చేసుకునేందుకు వందేమాతరం చరిత్ర తెలుసుకునే అవసరం ఉంది. ఆ చరిత్ర తెలియజెప్పటమే ఈ పుస్తకం ప్రచురించటంలో మా ఉద్దేశ్యం.

# వందేమాతరంకు సంబంధించిన ఘట్టాలు

| | | |
|---|---|---|
| 1762-1774 | : | బెంగాల్‌లో సన్యాసుల విప్లవానికి నినాదంగా 'ఓం బందేమాతరం' |
| 1838 | : | బంకించంద్ర ఛటర్జీ జననం |
| 1857 | : | బంకించంద్ర డిప్యూటీ మెజిస్ట్రేట్ కావటం |
| 1866 | : | బంకించంద్ర గురువు ఈశ్వరచంద్ర గుప్త తన కవితలో ఈ దేశాన్ని జనని, మాతృభూమి అని భావించుట |
| 1872-1876 | : | వంగదర్శన్‌కు సంపాదకులుగా బంకించంద్ర |
| 1875 | : | వందేమాతరం రచన |
| 1876 | : | యదునాథ భట్టాచార్య వందేమాతరం గాథను గానం చేయుట |
| 1879 | : | వాసుదేవ బలవంత ఫడ్కే విప్లవం |
| 1880 | : | వంగదర్శన్‌లో ఆనందమఠం నవల సీరియల్‌గా ప్రచురణ ప్రారంభం |
| 1882 | : | పుస్తకరూపంలో ఆనందమఠం |
| 1883 | : | రెండవ ప్రచురణగా ఆనందమఠం |
| 1885 | : | ఆనందమఠంకు ఆంగ్ల అనువాదం |
| 1886 | : | మూడవ ప్రచురణగా ఆనందమఠం |
| 1893 | : | ఆనందమఠం అయిదవ ప్రచురణ |
| 1894 ఏప్రిల్ 8 | : | బంకించంద్ర స్వర్గవాసం |
| 1896 | : | కాంగ్రెస్ సమావేశంలో రవీంద్రనాథ్ ఠాగూర్ వందేమాతరం పాడటం |

1905 జులై 20 : బెంగాల్ విభజన చేస్తామనే ప్రకటన

1905 ఆగస్టు 7 : వందేమాతరం పాడుతూ మొదటి బహిరంగసభ

1905 సెప్టెంబర్ 1 : బెంగాల్ విభజన

1905 సెప్టెంబర్ 5 : వందేమాతరం పై నిషేధాజ్ఞ

1905 అక్టోబర్ 16 : బెంగాల్ విభజనకు వ్యతిరేకంగా నిషేధదినం

1905 : మోతీలాల్ నెహ్రూ జవహర్‌లాల్ నెహ్రూకు ఉత్తరం వ్రాయటం

1905 : వందేమాతరం చెప్పటంతో చిత్తరంజన్ గుహ ఠాకూర్ మీద లాఠీ ఛార్జి

1905 నవంబర్ : రంగపూర్‌లో 200మంది విద్యార్థులకు 5రూ.లు జరిమానా విధించుట

1905 డిసెంబర్ : వారణాశిలో కాంగ్రెస్ సమావేశంకు నామ్‌ధార్ గోఖలే అధ్యక్షుడు. సుబ్రహ్మణ్యభారతి సమావేశంలో పాల్గొనుట

1906 : సోదరి నివేదిత రాష్ట్రధ్వజం మీద వందేమాతరం రూపకల్పన చేయుట.

1906 : మద్రాసులోని మెరినా బీచ్‌లో సమావేశం

1906 : వందేమాతరం బెంగాలీ, ఆంగ్ల దినపత్రికల ప్రారంభం, 'ఇందు ప్రకాష్' పత్రికలో అరవింద ఘోష్ వందేమాతరం విషయంలో 7వ్యాసాలు వ్రాశారు.

1906 ఏప్రిల్ 14,15 : బారిసాల్‌లో బెంగాల్ ప్రాంత సమావేశాలు

| | | |
|---|---|---|
| 1906 | : | ముస్లిమ్ లీగ్ ఏర్పాటు |
| 1907 | : | స్వదేశీ స్టీమ్ నావిగేషన్ కంపెనీ ప్రారంభం. |
| 1907 ఏప్రిల్ 16 | : | బంకించంద్రను అరవిందుడు 'ఋషి'గా గౌరవించడం |
| 1907 | : | సుశీల్ చంద్రపై లాఠీఛార్జి |
| 1907 | : | డా. హెడ్గేవార్ తరగతిగదుల్లో వందేమాతర నినాదం ఇచ్చుట |
| 1908 | : | వందేమాతరం పత్రిక చివరి సంచిక, నిషేధం |
| 1908 | : | మేడంకామా జర్మనీలో ఎగురవేసిన ధ్వజంపై వందేమాతరం |
| 1908 | : | ఖుదీరాంబోస్ బలిదానం |
| 1908 | : | తిలక్‌కు దేశబహిష్కరణ శిక్ష |
| 1908 ఫిబ్రవరి 27 | : | ట్యూటి కోరిన్‌లోని కోరన్ మిల్లులో కార్మికుల సమ్మె |
| 1908 మార్చి 12 | : | చిదంబరం పిళ్ళై అరెస్ట్ |
| 1908 మార్చి 14 | : | ట్యూటికోరిన్‌లో ఊరేగింపు |
| 1909 | : | జెనీవాలో వందేమాతరం పక్షపత్రిక ప్రారంభం |
| 1909 | : | బెంగాల్ విభజన రద్దు |
| 1909 | : | మదన్‌లాల్ ఢింగ్రా బలిదానం . |
| 1909 | : | ఆనందమఠంను అరవిందుడు ఆంగ్లంలో అనువదించాడు |
| 1912 అక్టోబర్ 22 | : | కేప్‌టౌన్ (ఆఫ్రికా) లో నామ్‌ధార్ గోఖలేను వందేమాతరంతో స్వాగతించటం |

| | | |
|---|---|---|
| 1914 | : | కెనడాలో విప్లవకారుల ఓడ కామాగాటామారు పై వందేమాతరం ధ్వజం |
| 1914 | : | లాలా హరదయాళ్ స్విట్జర్లాండులో వందేమాతరం దినపత్రిక ప్రారంభించుట |
| 1920 | : | లాలాలజపతిరాయ్ ద్వారా ఢిల్లీ నుండి వందేమాతరం హిందీ దినపత్రిక ప్రారంభం |
| 1923 | : | కాకినాడ కాంగ్రెస్ సమావేశంలో అధ్యక్షుడు మహ్మదాలీ వ్యతిరేకించినా పండిత విష్ణుదిగంబర పలుస్కర్ వందేమాతరం పాడుట |
| 1927 | : | వందేమాతరాన్ని మొత్తంభారత్ కు చెందిందని గాంధీ ప్రకటించుట |
| 1927 | : | రాంప్రసాద్ బిస్మిల్ వందేమాతరం పాడుతూ బలిదానం |
| 1933 | : | ఆనందమఠం నవలను జప్తుచేయుట |
| 1934 | : | వందేమాతరం పాడుతూ సూర్యాసేన్ బలిదానం |
| 1936 | : | వందేమాతరంకు ధ్వని ముద్రణ చేయటం |
| 1937 | : | ముస్లింలు వందేమాతరంను విమర్శించటం |
| 1938 | : | మాస్టర్ కృష్ణారావు కులంబ్రీకర్ పోలీస్ బాండ్‌పై వందేమాతరం ధ్వని ముద్రణ |
| 1938 | : | ఆంధ్రప్రదేశ్‌లో వందేమాతరం సమ్మె |
| 1938 | : | హరిపురా కాంగ్రెస్ సమావేశంలో వందేమాతరంను నిడివి తగ్గించి పాడుట |
| 1941 | : | బొంబాయిలో గుజరాత్ భాషలో వందేమాతరం దినపత్రిక వెలువడుట |

| | | |
|---|---|---|
| 1943 | : | మద్రాసులో ఇండియన్ కోస్టల్ బాటరీలో నున్న 9మంది యువకులు వందేమాతరం పాడుతూ బలిదానం |
| 1948 | : | రాజ్యాంగ నిర్ణాయక సమితిలో రాష్ట్రగీతం విషయమై చర్చ |
| 1948 ఆగస్టు | : | లోక్ సభలో వందేమాతరం గురించి నెహ్రూ ఉపన్యాసం |
| 1950 జనవరి 24 | : | 'జనగణమన'ను రాష్ట్రగీతంగా (National Anthem) నిర్ణయించుట. వందేమాతరంకు దాంతో సమాన స్థానం (National Song). |
| 1975-76 | : | వందేమాతరం శతాబ్ది ఉత్సవాలు |

# సమితి - సాహిత్యం

| | | |
|---|---|---|
| 1. | రాష్ట్ర సేవికా సమితి (సంక్షిప్త పరిచయం) | 6.00 |
| 2. | వందనీయ మౌసీజీ | 10.00 |
| 3. | శక్తి కేంద్రము | 5.00 |
| 4. | భగవాధ్వజము | 5.00 |
| 5. | కర్తృత్వము, నేతృత్వము | 3.00 |
| 6. | మాతృత్వము | 3.00 |
| 7. | సోదరి నివేదిత | 2.00 |
| 8. | ప్రాతఃస్మరణీయ మహిళలు | 3.00 |
| 9. | శ్లోకస్తోత్ర రత్నావళి | 3.50 |
| 10. | రాష్ట్రనాథ్ | 2.00 |